# రసపుత్ర కదనము.







ప్రచురణకర్తలు

విక్రయదార్లు

జి. సేతుమాధవరావు బ్రదర్సు,

గుంటూరు.

# Sri Venkateswara Co.,

## Book-Sellers & Publishers, GUNTUR.



# రసపుత్రకదనము

(చిత్తూరుపై అల్లాయుద్దీనుని దండయాత్ర.)

కొండపల్లి లక్ష్మణపెరుమాళ్లుగారిచే

రచియింపబడి,

గుంటూరు

జి. సేతుమాధవరావు బ్రదర్సు

వారివలన ప్రకటింపఁబడియె.

రెండవ కూర్పు

వెల రు 1-0-0.

 1922 

# పీఠిక.



ఔదార్యగుణధన్యులగు నోయార్యులారా!

సీ॥ సర్వజనావనాసక్తులై షట్చక్ర ♦ వర్తులే భూమికి భర్తలైరి?
వ్యాసవాల్మీకి బిల్హణ వామదేవ భా ♦ రవి కాళిదాసులే రమణిసుతులు?
కర్ణభీమార్జున గాంగేయకుంభ సం ♦ భూతు లేమానకుఁ బుత్రులైరి?
గౌతమ శ్రీవివేకానంద రామ ♦ మోహన శంకరుల కెద్ది జనని యయ్యె?
తే॥గీ॥ అట్టిభారతజనయిత్రి కవరరతము ♦ మేఖలాసన్నిభంబయి మించు వింధ్య
పర్వతశ్రేణికుత్తరపార్శ్వమందుఁ బుణ్యనిలయంబు రసపుత్రభూమి యుండు॥

అట్టి రాజస్థానంబున, నిష్కళంకంబై, చిరకాలపరిరక్షితమానంబై, నిరుపమవీర భోగ్యంబై, వివిధవిద్యాప్రశోభితంబై, కరుబంతవిశ్రాంతకీర్తిమంతంబై, సకల కువలయాధీశ సన్నుతపాత్రంబై, గొప్ప సూర్యవంశంబునందు జన్మించిన రసపుత్రకుమారాగ్రసరు లెనిమిదవ శతాబ్దంబున 'మీవార్' రాజ్యంబు స్థాపించినట్లు చరిత్రకారులు వ్రాసి యున్నారు. ఈ రాజపుత్రులు 'మీవార్' రాజ్యరక్షణాభివృద్ధికి ముఖ్యాధారభూతం బగు చిత్తూరు దుర్గరాజంబును నిర్మించి యవసరమువచ్చినప్పుడు తమ ప్రాణంబులనైనఁ గోల్పోయి తమ దుర్గలక్ష్మిని గాపాడుకొను చుండెడివారు.

రసకుమారులకెల్ల వంద్యుఁడై, రాణాబిరుదుఁగైకొని, చిత్తూరుదుర్గంబును రాజధానిగా నేర్పరచుకొని ప్రజాపరిపాలనక్రియాదక్షత్వంబు వహించి యొకరాజపుత్రశేఖరుండు చిత్తూరునందు సింహాసనాసీనుం డయ్యెను. అంతట రాణాకుటుంబము వారలు చిత్తూరురాజ్యంబు నేలుచుండెడివారు. అనుపమవిక్రమకళాసంపద్విశేషోన్నతులైన యీరసపుత్రవీరుల శౌర్యగాంభీర్యాది సద్గుణంబులను, త్రిలోకసుందరులైన రాజపుత్రస్త్రీల సతతపాతివ్రత్యంబును, మానాభిమాన సంరక్షణక్రియాసామర్థ్యంబును, గొనియాడుటకు సహస్రవక్త్రుండును, పరీక్షించుటకు సహస్రనేత్రుండును, విశ్వయించుటకు జగచ్చక్షుండును బూనుకొనవలసి యున్నప్పుడు స్వల్పప్రజ్ఞుండనగు నేను వర్ణింప సాహసించి నందులకు నన్ను క్షమింప వేడుకొనుచున్నాను.

నే నీ 'రసపుత్రకథనంబుల' రచించి దాదాపుగా నాల్గువత్సరము లైనది. ఇందుc గొంతభాగము బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారిచే రచింపcబడిన 'హేమలత' యను నవల ననుసరించియు శేషంబును శ్రీయుత బండారు అచ్చమాంబగారిచే వ్రాయcబడిన అబలాసచ్చరిత్రమాల యందుండు 'పద్మిని' యను కథ ననుసరించియు వ్రాసితిని.

బాలుండను, అదిగాక సంస్కృతాంధ్ర శాస్త్రములు రాని నాచే రచియింపంబడిన యీ కావ్యంబునందు లోపంబు లసంఖ్యాకంబులై యుండుట తథ్యంబుగాన నాల్గువత్సరంబుల నుండియు ముద్రింపనైతిని గాని వాక్చాతుర్యనైపుణ్యములకు పెద్దవారలను బాలకులయొక్క వచ్చియు రాని ముద్దుపలుకు లత్యానందం బొనగూర్చునట్లు పండితోత్తములకు నాయట్టి నన్నుc బోలు బాలురయొక్క వచ్చియు రాని కవిత్వం బానందదాయకం బగునని దృఢవిశ్వాసంబుగల్గి యుండుటకతంబునను, నా సహాధ్యాయులగు కొందఱు బాలుర ప్రోత్సాహంబునను, నే నీరసపుత్రకథనంబునందుc గొన్ని మార్పులంజేసి నా బాల్యంబునుండియు నాకు మిత్రుండగు గుండు వెంకటలింగము గారి ధన సహాయంబున దీనిని ముద్రింపcగలిగితిని.

నాయందుc గరుణవహించి యీకావ్యంబునం గల లోపంబుల సవరించి నన్నుc గృతార్థుం జేసిన బ్రహ్మశ్రీ కుంరాడ దుర్గానాగేశ్వరశాస్త్రులు గారికిc గృతజ్ఞతాపూర్వకముగా ననేక నమస్కారంబు లాచరించుచున్న వాcడ. ఇది నా ప్రథమోద్యమము గాన నిందునం గల లోపంబుల మన్నించుటకు మిమ్ము ప్రార్థించుచున్న వాcడ.

ఇట్లు విధేయుcడు,

కొ॥ పసల్లి లక్ష్మణపెరుమాళ్లు.



# ఇందువచ్చు పాత్రలు

పురుషులు.

సూత్రధారుఁడు.

మారిషుఁడు.

విక్రమసింహుఁడు—ఒక క్షత్రియకుమారుఁడు.

కాపాలికుఁడు.

సుమిత్రుఁడు—విక్రమసింహుని మిత్రుఁడు.

వసంతభట్టు—ఒక మహాశాస్త్రి బ్రాహ్మణుఁడు.

భీమసింగు—చిత్తూరురాజ్య సంరక్షణ కర్త.

బాదూల్ సింగు—ఒక రజపుత్రకుమారుఁడు. భీమసింగునకు ముఖ్యాలోచన పరుఁడు.

సేవకుఁడు.

లక్ష్మణసింగు—చిత్తూరు రాణా. [బాలుఁడు].

చిదానందయోగి—విక్రమసింహుఁడు.

ఆనందుఁడు—వసంతభట్టు పరిచారకుఁడు.

గోరాసింగు—రజపుత్ర సైన్యనాయకుఁడు, బాదూల్ సింగు తండ్రి.

ప్రతాపసింగు, దుర్గసింగు—రాజపుత్ర వీరులు.

పాండురంగనాథుఁడు—ఒక కపటయోగి.

జయసింగు, అజేయసింగు,
సమరసింహుఁడు, సాగరసింహుఁడు. } భీమసింగునకుఁ బుత్రులు.

సేవకుఁడు.

అల్లాయుద్దీను—డిల్లీ పాదుషా.

రహిమానుఖాను—తురుష్క సైన్యనాయకుఁడు, అల్లాయుద్దీనునకుఁ బ్రియమిత్రుఁడు.

నాజరుజంగు—తురుష్క సేనానాయకుఁడు.

శూరసింగు—ఒక యుద్ధభటుఁడు.

స్త్రీలు.

పద్మినీదేవి భీమసింగునకు భార్య.

పురదేవత.

# దస్తావేజుల మతలబి.

కొత్తప్రతులు ముద్రించినారము.

ఇందు, 1 ముఖ్యాంశములు, 2 గమనించతగిన విషయములు, 3 విక్రయ 4 తాకట్టు 5 రద్దు 6 వాస్కూ విడుదల 7 తీర్మానము 8 మరణశాసన 9 పవరప్ అటర్నీ 10 సెటిల్‌మెంటు 11 ఫైసలాయింపు 12 దాన 13 దత్తత 14 కవులు కబోలీయతు 15 ఖరారునామా 16 ప్రామిసరు 17 సవరణ 18 హామీ 19 మనవర్తి 20 ఫారిఖత్తు 21 వ్యాపార సంబంధ లేక వర్తక సంబంధ 22 పంచాయితి 23 క్రిమినలు 24 సివిల్ 25 వివిధములగు కోర్టు సంబంధ 26 రిజష్టరేషను విషయములగు ముఖ్యాంశములకు దస్తావేజులలో ఒక్కొక రకమునకు అనేక మతలబులతో క్రొత్తగా తయారు చేయబడి గ్రంధము ప్రయివేటు వకీల్లు వకీళ్ల గుమాస్తాలు క్రొత్తగా దస్తావేజులు వగయిరాలు వ్రాయనేర్చువారలకు ఇది అత్యంత ఉపయోగము. దీని విషయము వ్రాసిన చాలదు ఒకసారి కాపీకు ఆర్డరు ఇచ్చి చూడుడు. దస్తావేజులు చాలా కాలము వ్రాయుటలో నిపుణులయిన వారలు కూడా చాలా రకముల దస్తావేజులు వ్రాయుటకు మతలబులు తెలియని వారలు గలరు. అవియన్నియు ఇందుగలవు. ఇందు కొత్తమాల్యు ప్రకారం కోర్టుఫీజు స్టాంపు డ్యూటీ, రిజిష్ట్రారు ఆఫీసు ఫీజులు గలవు.

వెల పోస్టేజి గాక రు 1—0—0
పోస్టేజి సహా 1—6—0

వలయువారలు.

డి. సేతుమాధవరావు బ్రదర్సు
గుంటూరు

అని వ్రాయవలెను.



మారిషా! వేగమే యొకపర్యాయం బిటురమ్ము.

మారిషుడు.—(ప్రవేశించి) బావా! నన్నింత త్వరితగతిఁ బిలిచిన గతం బేమి?

సూత్ర—మారిషా! మనకు సభికులాజ్ఞాపించిన జ్ఞప్తియేని నవీననాటకం బిచ్చోఁ బ్రదర్శించి వారిమనంబుల రంజింపఁజేయవలయును. నీవు నేఁడింత తడవుసేయుటకుఁ గారణం బేమి?

మారి—ఏమి చెప్పుదును! మనరాజ్యలక్ష్మిని దురుష్కుం డెత్తుకొనిపోయెను. మే మాచోరుని వెదకుచుంటిమి. అయిన మీరిచ్చట నెద్దియాడ నుద్యుక్తులైతిరి?

సూత్ర—మారిషా! నీ వాడినమాటల నాలకించినందున నాకొక నూతనకథ జ్ఞప్తికివచ్చినది.

మారి—ఆకొత్తకథ యెద్ది?

సూత్ర—చిత్తూరు రాజ్యలక్ష్మిని దురుష్కనాథుండగు నల్లాయుద్దీనుండు వశపఱచుకొనెను. అక్కథ నిచ్చట బ్రదర్శింప సంసిద్ధుండనైతిని.

మారి—బావా! యక్కథాసందర్భ మించుకఁ దెలియఁజేసెదవా?

సూత్ర—మారిషా! కుమువఁబోవుచుఁ గూరలరుచి నడుగనేల? దాని నిచ్చో నాడ నుంటిమిగదా!

మారి—పోనీ, దానిని రచియించినదెవ్వరు?

సూత్ర—

తే॥ గీ॥ కొండపల్లికులాబ్ధి చంద్రుఁడు కీర్తి
పరుఁడు శ్రీవత్సగోత్ర సద్బ్రాహ్మణుండు

శిష్టుఁడగు శ్రీనృసింహుని జ్యేష్ఠసుతుఁడు,
లక్ష్మణపెరుమాళ్ళు రచించె లలితముగను॥

అతేఁడు.

తే॥ గీ॥ సంస్కృతంబాకయింతయుఁ జదువలేదు
తెనుఁగునం దొకించుక ప్రాజ్ఞతను వహించి
సన్నుతమగు నోబిల్ కళాశాలయందు
హూణభాషను బఠియించు చున్నవాఁడు.

మాః—(నవ్వి) హూణభాషార్థులేడ! నాటకంబులు రచింపు టేడ! అందలి యసంఖ్యాకంబులగు లోపంబులు వినినఁ బండితోత్తములు పరిహసింపరా ?

సూత్రి—ఏల పరిహసింతురు ?

ఉ॥ బాలురు ప్రాకులాడి నడువంగఁ గడంగియు నచ్చటచ్చటం
గూలఁబడంగ సాయ మొనకూర్పరె? యుక్తవయస్కు లట్టులన్
బాలకవిత్వయత్నమున బల్మిలు లోపము లున్నఁ బాడితుల్
లీల క్షమించివాని వెడలించియు నొప్పులు మెత్తు రెప్పుడున్॥

మఱియుఁ గృతికర్త యిట్లు విజ్ఞాపనంబుఁ జేసికొనుచున్నాఁడు.

శా॥ "ప్రాయంబెన్నఁ బదేనువత్సరములే బాలుండు దా నెవ్విధిన్
వ్రాయంజాలెఁ గృతిన్? గవిత్వమునలోపంబుల్ కనన్ జెక్కురా!
వా" యంచున్ మదిసందడింపకుడి విద్యాసాంద్రులారా! సహా
ధ్యాయవ్రాతములార! నా కిపుడు ప్రోత్సాహంబుఁ జేకూర్పుడీ॥

మారిషా! కాలాతీతంబగుచున్నది. ఇఁక మనము పోవుదము,

ఇది ప్రస్తావన.





శ్రీరస్తు.

# రసపుత్రకదనము

* ప్రథమాంకము *

## ప్రథమరంగము.

ఢిల్లీపురమునందలి చెఱసాల.

(ప్రవేశము)

విక్రమసింహుఁడు కూర్చుండి యుండును:—

విక్రమసింహుఁడు (విచారముతో)

ఉ॥ వాసియు వన్నెయుం దఱిగె బందెవిముక్తుఁడ నౌదునంచుఁ జే
రాసవహించితిన్ విధిపురాకృతకర్మఫలంబొ లేక యే
దోస మొనర్చినందులకొ దుర్గతిపాల్పడి దైన్య మొప్పఁగా
గాసిలుచుంటి నన్నిపుడు కావఁదలంచెడు వార లెవ్వరో ?॥

ఓరీ యల్లాయుద్దీను! వామమార్గశిఖామణీ! పయోముఖవిష కుంభమా! నీ వింత కృతఘ్నుండ వగుటకు నేను నీ కేమి కీడుదలంచి తిని? ఎంతయో మేలొనరించి యుంటినిగదా!

ఉ॥ కూరిమి మీఱ నిన్నిపుడు గొల్చుచు, దేవగిరిప్రభుండు దాఁ
బోరున నోడి కప్పమును బోడిమి వేగ నొసంగునట్లుఁ జే
కూరఁగఁ జేసినట్టినను గొంకక దుర్గతి పాలొనర్ప నో
క్రూర! మదోన్మదుండ! తడిగుడ్డల గొంతులు గోయఁ బాడియే?॥

దుర్మార్గా! అల్లాయుద్దీను చక్రవర్తీ! నేనీ విపదంబురాశిని మునింగియుండుటకు భవద్విద్వేషజంఝూమారుతంబే గదా హేతుభూతంబు? నీవింతటి విశ్వాసఘాతకుండ వగుదువని యెఱుంగక పోవుటచే సోదరప్రాయులగు మహారాష్ట్రవీరుల నిర్హేతుకముగా నుక్కడించి నీకు విజయలక్ష్మినిఁ జేకూర్చితిని. ఔరా! యశేషరాజ్యకాంతాయత్తచిత్తుండవై వయోవృద్ధుండగు జలాలుద్దీను చక్రవర్తిని వధియింప యత్నింపవలదని నీతులు గఱపినందులకా నన్నీదుర్గతి పాలొనరించుట! ఓరీ! పాపీ! పితృఘాతకా! సుగుణగణరత్నాకరుండగు నీ పినతండ్రి నీ కేమి యపకృతి నొనరించెను? లోకానుభవ మించుకైనను లేని కడు చిన్నప్రాయమున జననీజనకులు మృతినొందిన దిక్కులేని పక్కివగు నిన్నెంతయో మక్కువతోఁ బెంచెనుగదా! అన్నకుమారుండవని యించుకైనను రోయక నీకు సకలవిద్యలు నేర్పించిన పుత్రవత్సలుని నకారణంబుగ వధించుటకుఁ గతంబు విజయోన్ముఖుండవగు నిన్నెదుర్కొని ప్రేమాతిశయంబునఁ గౌగలించుకొనుటయా? ఆ నిష్కపటాత్ముని నీకరవాలధారఁ గెరఁజేయుటకు నీకెట్లెఱంగున కరములు బలిమి నిచ్చెను? ఔను, దుష్టుల కుపకారంబొనరింప వెంటనే యపకారంబు వాటిల్లునుగదా!

తే॥ గీ॥ కాలుడవినంత దహియించు గాఢమైన
వహ్నిమధ్యను వెత జెందు పన్నగమును
నావలకు దీయఁగా నలు నంతవానిఁ
గరవకుండెనె యురగ మకరుణ మెఱయ॥

నే నెవ్వారిని దూరిన నేమిప్రయోజనము. ఈ దుర్గతి నాచేతులారఁ దెచ్చుకొంటిని.

ఉ॥ ఇంచుకయేని బుద్ధిజనియింపమి మ్లేచ్ఛునిఁ గొల్చి సంశయిం
బించుకయైనలేక జనఘుత్రికిఁ గూర్పఁగఁ బుత్రదుఃఖముల్

దుఃించితి దేశరక్షకులఁ గూ్రరుఁడ నాచును ద్రోహ మెంతయో
పెంచితిఁ దత్ఫలంబనుభవించుచు నుంటి విధాతృనానతిన్.

ఎట్లును నెల్లి సూర్యోదయంబున నాకు మరణదండన తప్పదు. ఆపన్నివారణుండగు వైకుంఠేశుని వేఁడుకొని పావనుండ నయ్యెదను. సరసిజసంభవస్తుత్యా! క్షీరసాగరశయనా!

మ॥ నలువనుగన్నఁ బ్రామి దితిసందనుఁ డొక్కఁడు వేదమంత ముి
చ్ఛిలి జలరాశి మున్గ మదిఁ జింతిలి నిన్ను నుతించి వేఁడఁగా
జలనిధి మత్స్యరూపమునఁ జయ్యనఁజొచ్చి, నిశాచరాధమున్
బలమునఁ జంపి వేదతతి బ్రహ్మకొసంగినదాత! కావుమా॥

దుష్టశిక్షణా! శిష్టరక్షణా! జగన్నాథా!

ఉ॥ శాపమువల్ల దుర్మద నిశాచరుఁడై జనియించి భూమినిం
జాపగఁజుట్టి గర్వమునఁ జంకనుబెట్టు కొటేంగి, భూమిసం
తాపము దీర్ప నాతని మదం బడగించితె సూకరాకృతిం
బాపవిహీన! భక్తపరిపాలక! నన్నుఁ గృతార్థుఁ జేయుమా॥

దైత్యకులాంతకా! నారసింహా!

కం॥ దంభవ్రతుఁడగు దైత్యుఁడు
డింభకుఁ బ్రహ్లాదువెతల డింపగను నయ
స్తంభమునం దుదయించియు
దంభవ్రతుఁజంపలేదె తనయునిఁ బ్రోవన్॥ ?

సూర్యకులప్రదీపా! దీనరక్షణపరాయణా!

సీ॥ దైత్యురాలగు ఘోరతాటకి వధియించి,
గాధేయుజన్నంబు గావలేదె?

కడుక్రూరులైన యా ఖరదూషణులఁ జంపి
మౌనుల వెతలను మాన్పలేదె?
వాలిని వధియించి వనచరరాజ్యంబు
సుగ్రీవునకు నిచ్చి సురలు మెచ్చ
రావణకుంభకర్ణదనుజులను జంపి
సీతను గాపాడి ఖ్యాతిఁ బడయ
తే॥ గీ॥ సద్గుణాంబుధి నా విభీషణుని బ్రోచి,
యమరగణముల రక్షించి తౌర నీవు;
నన్ను గావంగ భరమె? యో నలిననేత్ర!
పంకరుహగాత్ర! దశరథవరతనూజ! ॥

కృష్ణా! వ్రజసుందరీమనోరంజనా!

సీ॥ కడఁ జిన్నవయసునఁ గాళియాహిని ద్రొక్కి-
గోపబాలురకు మేల్గూర్పలేదె?
కంసాసురుని జంపి కంసాత్మజునిగాచి
వసుదేవు కష్టము ల్బాపలేదె?
ద్రౌపదివలువలు రచ్చలోఁ గోల్పోవఁ
బడఁతిమానంబు గాపాడలేదె?
సురలోకకంటకు నరకాసురుని ఘోర
సంగరంబున ద్రుంచి భంగపడిన
తే॥ గీ॥ వనిత బృందంబుఁ జెఱనుండి పాపలేదె?
నిన్ను నెరనమ్మియుంటి నాపన్నివార
ణుండ నను బిరుదు వహించి యుండలేదె?
చెఱ విముక్తునిఁ జేయఁగాఁ గరుణలేదె? ॥

పాదశబ్దంబులు వినంబడుచున్నవి. ఎవరో వచ్చుచున్నట్లున్నది. అహా! నిద్రాదేవి ప్రసన్నమగుచున్నయది. (అని పడుకొనును.)

(ప్రవేశము) సుమిత్రుఁడు.

నేటికిఁగదా సమయముదొరికినది! నాయజమానుండగు వసంతభట్టు కారాగృహాధికారిగా నియమింపంబడిననాటంగోలె, నే నెట్లయిన నాతనిమోసపుచ్చి చెఱసాలబీగంబుల నపహరించి, స్నేహితుఁడగు విక్రమసింహుని చెఱనుండి విడిపింప యత్నించుచుండ, విక్రమసింహుని పూర్వజన్మసుకృతమువల్లను, నేఁడా మతిమంతుండగు వసంతభట్టు చక్రవర్తితోఁ బ్రయాగ కరుఁగుచుఁ గాలవశంబున బీగంబుల నింటియొద్దనే విడిచిపోవుటచేతను, నాకీ తాళపుఁజేతులు లభించినవి నేఁడెవ్విధంబుననైన నీచెఱసాలతాళముఁ దీసి విక్రమసింహుని విడిపించెదను. అక్కార్యంబు నిరాటంకముగా నిర్వహించుకొనుటకు, దగుసాధనంబులతో వచ్చితిని ఈ సారాయిబుడ్లు కావలివానికిఁ ద్రాగ నిచ్చి యాతఁడు కిమత్తెక్కినపిదప నాపని నెఱవేర్చుకొనియెద.

(ఆలోచించి) ఒక వేళ నాతనికి మత్తెక్కకున్న నెవ్విధంబుననైన నాతఁడు నాబొట్టునుఁ జూచునట్లు జేసెద. తురకలు తిలకంబునుజూచిన నాకిపై చుదురుగాన నతం డట్లొనర్చును. నే ధరియించిన తిలకమువిషసంయుక్తంబగుటచే నాతండు మడియును. నేను నా కార్యముకొనసాగించుకొనెదను. (అని లోనికిఁ బోవును.)

(ప్రవేశము—కావలివాఁడు)

కావలి:— లోనికి వచ్చునది యెవరు?

సుమి:— నేను వసంతభట్టుగారి పరిచారకుఁడను.

కావలి:— అయిన నిక్కడికింతరాత్రియం దేలవచ్చితివి?

సుమి:— మా యజమానుఁడు మీరు మెలఁకువగా నుండిరో లేదో చూచి రమ్మనెను.

కావ:— అయిన సరేగాని నీచేతిలోని సీసా లేమిటి?

సుమి:— ఇవి సారాబుడ్లు.

కావ.—ఏమి హిందువులు సారాఁ దాగెదరా?

సుమి.—ఔను కొందఱు త్రాగెదరు.

కావలి.—(తిన్నగాఁజూచి) నీవు హిందువుఁడవుగావు ఆబుడ్లు నాకిమ్ము దాహము మిక్కుటముగా నగుచున్నయది. (అని కలియఁ బడును.)

సుమి.—ఆగు. ఆగు. నేను హిందువుఁడనే. ఇఁక నాబొట్టుచూడుము.

కావలి.—(బొట్టుఁజూచి) నీవు బొట్టు లేకున్న హిందువుఁడవుగావుగదా. (అని బొట్టునాకి తన్నుకొని క్రిందపడి చచ్చును.)

సుమి.—అట్లా చావు ముండాకొడకా! ఇఁక నేను తాళముఁదీసి పోయెదను. (అని తాళముఁ దీసి పోవును)

విక్రి.—(లేచి) ఏమి! ద్వారంబులు తెఱువఁబడి యున్నవి. ఇది యార్తరక్షణపరాయణుఁడగు నైకుంఠేశుని మహిమయై యుండుట తథ్యము. (కావలివానిఁజూచి) ఏమీ! వీఁడు విగతజీవుఁడై పడియుండెను! (ఆలోచించి) ఔరా! విక్రమహార్యక్షుంబులగు సుక్షత్రియుల పక్షమువాడ నయ్యు కుక్షిపోషణార్థము మానాభిమానంబుల నీటఁ గలిపి, తురుష్కులఁ గొల్చి తన్మూలంబున భ్రాతృహత్య సంపాదించితిని. అమ్మహాపాపవిశేషంబునఁ గారాగృహప్రాప్తుండనై తుద కిట్లా వైకుంఠేశుని కృపచే విముక్తుండ నైతిని. ఇప్పటికైనను బుద్ధిఁ దెచ్చుకొని దేశహితార్థమై తిరుగవలయును. కావున మొన్నటి సంగరంబునఁ బరాభూతుండైన రామదేవుని నెయొద్దకుం బోయి యాతనిని మఱల యుద్ధంబునకుఁ బురికొల్పి తత్సేనలకు సాయం బొనరించి తురుష్కనాథుని మదం బడగించెదను.

(నిష్క్రమము.)



ద్వితీయరంగము.

ఎడారి.

(ప్రవేశము) సన్యాసివేషధారుండయిన విక్రమసింహుఁడు.

చం॥ తపనుడు వేఁపఁజొచ్చెఁ బరితాపముహెచ్చెను శాంతి నొందఁ బా
దపముఁ గనంగరాని యతి దారుణమైన యెడారిసీమలన్
గపటవు మౌనివేషమును గైకొని కుమ్మరు చుంటి నింత యీ
తపమున కొర్వలే సకట తథ్యము దుర్మరణంబు నా కగున్॥

ఆహా! యెంతటి ధనధాన్యసత్వ సంపన్నులనైన వింతగ వాతల పొంతఁ జేర్చునో విధీ! యెంత గొనరించితివి!

శా॥ జన్మస్థానముఁ బాయఁ జేసితివి నీచంబైన దాస్యంబున
స్సన్మానం బొనఁగూర్చి రాంతట చమూనాథుండనై యందునుం
డ స్మద్బంధుల మిత్రవర్యులను పీడం జేసి సంతృప్తి లే
కున్మాదాంబుధి డించి యోగివరుగా నుండంగ నిర్మించితే॥

(ఆలోచించి) సరిసరి! నిన్ను దూరవలసిన దేము:న్నది, స్వయంకృతాపరాధంబుగదా!

తే॥ గీ॥ సర్వసామాన్యకుక్షిరక్షణకుఁ బరులఁ
గొలుచు దుర్బుద్ధి మనమునఁ దలఁచుశ్రేల
తలఁచినను స్వమతస్థులు ధరణిపతులు
గలిగియుండియుఁ దురకలఁ గొలుచుశేల?

హా! జలాలుద్దీనుచక్రవర్తీ! నీ వున్నంతకాలము మా కెట్టి యిక్కట్టులును సంఘటిల్ల లేదుగదా! 'పాపీ చిరాయు' వన్నట్లీ విష కలిత మానసుండగు నల్లాయుద్దీనుండెంతకాలం బీ పవిత్రంబగు హిందూదేశంబును బరిపాలింప నున్నాఁడో "అహింసా పరమో ధర్మ"

యని సర్వభూతంబులయందును వాత్సల్యపూరితహృదయులగు షట్చ
క్రవర్తులచేఁ బాలింపఁబడిన పావనోదారంబగు నో యార్యావర్తమా!
గో నరహత్యలం దారితేఱిన ముష్కర తురుష్కులచేఁ బాలింపబడు
చుంటివిగదా!

అబ్బా! యేమి! యీతురుష్కులొనరించు ఘోరకృత్యంబులు!

సీ॥ ఏవైపుఁ జూడఁగన్న నావైపు బ్రహ్మన
క్షత్రులనోట మాంసంబు గ్రుక్కుచుండు
నేవంక వీక్షింప నావంక గోవులఁ
గఱకుఁ గత్తులచేత నఱకుచుండు
నేవీధిఁ గాంచిన నావీధి స్త్రీలను
బలవంతముగఁ జెఱఁ బట్టుచుండు
నేయింటఁ జూచిన నాయింట బాలిక
లెందఱుండిన దొంగిలించుచుండ్రు

తే॥గీ॥ మద్యమదమాంసముల నెక్కి మత్తుఁ జెంది
యూళ్లపైఁబడి యిండ్లను గొల్లఁ బెట్టి
సాధుజనులకు నెన్నియో బాధలిడుచుఁ
బ్రజలపాలిటి దైత్యులై ప్రబలు చుండ్రి.

సమదరిపుగజసింహా! నారసింహా! తొల్లి బల్లిదులై భారత
మాత యుల్లంబు దల్లడిల్ల జేసి, దేవలోకంబును భీతిల్లం జేసి, దైత్యవల్ల
భులు ప్రబలియుండ ముల్లోకంబులు రక్షింప నరావతారధారుండవై
దైత్యవల్లభుల తలల డొల్లనేసి, యెల్లరి సిలుగుల నెల్లఁ బాపి యుల్లం
బులు రంజిల్లున ట్లొనర్చినట్లే తురుష్క వధియింప నీవైన నవతారం
బెత్తరాదా? దైవమా! హిందూదేశస్థితి యెంతవఱకుఁ దెచ్చితివి!

సీ॥ సత్యవ్రతులు హరిశ్చంద్రాది షట్చక్ర
వర్తు లేలిన యట్టి భరతభూమి

రాజ్యతంత్ర నిపుణాగ్రణి చంద్రగుప్త భూ
పాలుఁ డేలిన యట్టి భరతభూమి
యద్వితీయ కరుణాయత్తచిత్తు డశోక
వర్ధను డేలిన భరతభూమి
దుర్నివార ప్రదీప్త సు పృథ్వీరాజభూ
వరుఁడు పాలించిన భరతభూమి
తే॥ గీ॥ అట్టి దిప్పుడు సకలశాస్త్రాఖ్యములు వీడి
యస్పృతవాదులు, గోసవహంతకులు, కు
మతులు, దుర్మార్గవర్తనమతులు, తురక
పాసనులచేతఁ బాలింపఁ బడుచు నుండె.

సీ. ఏదేశఁ గనుగొన్న హృద్విదారిణములౌ
నాహవంబులఁబడి యడలు మూఁకు
లెచ్చోటవీక్షింప విచ్చుకత్తుల బూని
దేశపుత్రుల తలల్ ద్రెంచు తురక
లేసీమఁ గాంచిన భాసురంబగు రాజ్య
ముల వీడి యడవుల నిలుచురాజు
లేచోటఁ బొడగన్నఁ గూడుగుడ్డలు లేక
క్షామదేవతపాల సమయుపేద
తే॥ గీ॥ లేగృహంబున జూచిన నెంద టెంద
టిందుబింబాస్య లాహవమందు నిహతు
లైన నిజనాథులకయి శోకాబ్ధి మున్గి
మునుఁగుగతిఁ గానలేకను గుందుచుండ్రి॥

అబ్బా! యేమి చండకిరణుండగు ప్రచండమార్తాండుఁ డెట్లు దహించు చున్నవాఁడు!

సీ॥ పూర్వాహ్ణ మందుండి భోజనంబే లేక
పరితాప మొందు క్షుద్బాధితుండ

ముష్కరాధములు తురుష్కుల నిందుండి
వెడల నంపఁగఁ బాటుపడెడువాఁడ
స్వాతంత్ర్యవృత్తిమై పరనృపాలుర వీడి
దేశహితార్థమై తిప్పరువాఁడ
రసపుత్రులకు మహారాష్ట్రులు పంపిన
సందేశ మర్పింపఁ జనెడువాఁడ
తే॥ గీ॥ వారలకుఁ మైత్రిఁ జేకూర్పఁ బాటుపడెడు
క్షత్రియునిమీఁదనా నీ ప్రచండతాండ
వంబుఁ జూపించు టేలొకో యంబుజాప్త
అకట! పిచ్చుకపైని బ్రహ్మాస్త్ర మనఁగ॥

ఆ పొడగట్టునది చిత్తూరుప్రాంతకాంతారంబయి యుండ నోపు. అనతిదూరంబున నుండు పల్లియకుం జని తదుపరి చిత్తూరును బ్రవేశించెదను. (ఆలోచించి) చిత్తూరున కేగిన నేమిప్రయోజనము?

ఉ॥ దేవగిరిప్రభుండు సువిధేయత నంబుజమిత్రవంశజుం
డా వసుధాధినాథునకు నంపిన లేఖల మార్గమధ్యనే
పోవిడి చోరవర్గమున మూషమతిం జని వేగ నాచితోఁ డ్
భూవిభు నెట్లుఁ జేరుదును పోయిన నాతని కేమిదెల్పుదుఁన్.

కావునఁ బోకున్న నెంతప్రయోజనమో పోయిన నంతేప్రయోజనము. ఒకవేళఁ బోయినయెడలఁ బ్రచ్ఛన్నవేషధారుండ నగునా కేమియైనఁ గీడు మూడకపోదు. ఎట్లును పోకతప్పదు. ఆపురియందు జిదానందయోగివేషంబున నుండి క్రమక్రమమున రసపుత్రశూరులతో నెయ్యంబొనఁ గూర్చుకొని వారిద్వారా మదభీష్టంబు నెరవేర్చుకొని యెద. (నిష్క్రమము)

---



శ్రీరస్తు.

# రసపుత్రకదనము.

## ద్వితీయాంకము.

### ప్రథమరంగము.

డిల్లీపుర బాహ్యసీమ.

(ప్రవేశము) వసంతభట్టు.

ఆహా! యీ యల్లాయుద్దీను చక్రవర్తి నన్నెట్టి ప్రాణాపాయకరంబగు పనికి నియోగించెను! ఘోర కాంతారమధ్యస్థితంబై, యభ్రంకషోత్తుంగధరాధర పరివేష్టితంబై, యనుపమవిక్రమ కళాసమన్వితులమని విఱ్ఱవీగు రసపుత్రులశౌర్యవిజృంభణవల్లికి బట్టుకొమ్మయై యనిర్వర్ణనీయదృఢతరప్రాకారద్వారసమన్వితమైన చిత్తూరుదుర్గంబునఁ బ్రవేశించుట కెనయగు భూమ్యంతర రహస్య ద్వారములును, ఆయుధాగారములును, అర్థకోశంబులును, చతురంగబలసమృద్ధియు, గూఢచారుల నైపుణ్యంబును, మొదలగు విషయంబుల నెప్పటి కప్పుడు చక్రవర్తికిఁ దెలుప యత్నింపవలయునుగదా. ఇందుల కాతండు నాతోఁ గపటకలహంబు గల్పించుకొని నన్నుఁ గారాగృహంబున నున్చి క్రిమ్మఱ నిన్నరేయి విముక్తినిఁ జేసెను. (ఆలోచించి) రసపుత్రుల పాలి కరుగుట సింగంబుల మధ్యకు మదగజంబు పోవునట్లగును. ఈచక్రవర్తితోఁ జెలిమి సంపాదించుకొనుట పాముతో నెయ్యం బొనకూర్చుకొనునట్లే. ఈపర్యాయము చక్రవర్తికోర్కె నెరవేర్చినట్లయిన

నాకు మంత్రిత్వము సిద్ధించును. కావున నెట్లయిన రసపుత్రులకడ కేగి మద్వాక్చాతుర్యనైపుణ్యంబున రాజపుత్రరాజ్యసంరక్షణ కర్తయైన భీమసింగును గమ్మబామి చక్రవర్తికోర్కె సాఫల్యం బొనరిం చెదను.

---

## ద్వితీయరంగము.

### భీమసింగు మందిరము.

(ప్రవేశము.) భీమసింగు, బాదూల్ సింగు.

భీమ.—శూరాగ్రేసరా! చక్రవర్తికడ కరిగివచ్చితివిగదా. అందలి విశేషంబు లేమి? చిత్తూరు దండయాత్రవిషయమై చక్రవర్తియుద్దేశంబు నెఱింగితివా?

బాదూల్.—మహారాజా! "సజ్జనసామాన్యుండగు జలాలుద్దీనుచక్రవర్తిని వధించి తాను సింహాసనాధ్యక్షుండైన నాటంగోలె నల్లాయుద్దీనుండు దుర్మార్గుండై రాజ్యాంధకారమగ్నీభూతచేతస్కుండై ప్రజల నెంతయో కష్టంబెట్టుచు ముఖ్యముగా నందు హిందువుల నెనలేని యిక్కట్టుల పాలొనరించుచు గోనరహత్యలం దారితేఱిన భటవర్గంబులదేశంబునందంతట వ్యాపింపఁజేయుచు బ్రహ్మావర్తుల మహమ్మదీయమతావలంబకు లగునట్లు బలవంతబెట్టుచు నందులకు సమ్మతింపనిచో శిరచ్ఛేదనంబుల నొనరించుచుండు"నని ప్రజ లాతని సర్వకాలసర్వావస్థల యందును దూషించుచుందురు. ఇట్టి పరమనిచుండు రాయభార మంగీకరించు టెట్లు? చిత్తూరు దండయాత్రవిషయమై ప్రశంసించునప్పుడుతనకట్టి దురుద్దేశంబు లేదనియు రాజపుత్రులుతనకుసోదరప్రాయు లనియు నొక్కి వక్కాణించినప్పటికి మన మాతని మాటలువిశ్వసింపరాదు. కావున మన మనవరతము యుద్ధసన్నిద్ధులమై యుండవలయును.

సేవకుఁడు.—(ప్రవేశించి) మహాప్రభూ! ద్వారముకడ నెవ్వరో వేచి యున్నారు. మీదర్శనం బడయఁగోరు చున్నారు.

భీమ.—సేవకా! తత్క్షణ మాతనిం గొనిరమ్ము.

(సేవకుం డరిగి వసంతభట్టుతోఁ బ్రవేశించును.)

వసం.—(అంజలి బద్ధుండై)

చ॥ శరణు, పయోజమిత్రకుల సాగరచంద్రమ! భూధవేంద్ర! దు
ష్టరిపుమదేభభంజన! విశాలయశోధన! భూషితాంగ! సు
స్థిరనుతసత్త్వవర్తన! సుధీనుత! యార్తజనప్రపోషకా!
నిరుపమశౌర్యధైర్య ధరణీధరరాజమ! భీమసింగమా!॥

భీమ.—(తనలో)

చం॥ వినయవివేకము ల్పొరలి, వేడ్కనుగూర్చు సుభాషణంబులన్
దనరు విభూతిరేఖల విధంబును గన్గొన ధారుణీసురుం
డనుటకు సందియంబు వల దైనను నీతనిదైన సచ్చరి
త్రను గ్రహియించి, యీఁదగు ధర్మమొనర్చియుఁబంపఁగావలెన్॥

(ప్రకాశముగా) పురుషవర్యా! భానుకుల ప్రదీప్తులు శరణాగత త్రాణబిరుదాంకులు గదా.

ఉ॥ భంగ మొనర్చి నిన్నుబహుభంగుల గాసిలఁజేసె నెవ్వఁడే
భృంగినినైన వాని గరువంబు దురంబున రిత్తబుత్తు సా
రంగధరుండు సాయమయి రాని, భయంబున భూమిఁ జొచ్చనీ
నింగికి నేగనీ, నలిననేత్రుఁడు ధాత్రికివచ్చి పోరనీ॥

కావున

తే॥ గీ॥ వలదు వలదిక భయపడవలదు, నీకు
నభయహస్తంబు నొసఁగితి నంతరంగ

మందు నన్యంబుఁ దల్పకుమయ్య! నీదు
చరిత దెలియంగఁ జెపుమి నిశ్చయముగ నిట॥

వసం—మహారాజా! భవద్భుజాస్కంధంబులచే రక్షితుండనగు నాకు నేమియుఁ గొఱంతలేదు. మచ్చారిత్రంబును విశదీకరించెద నాలింపుఁడు.

సీ॥ ఉగ్రజన్ముండ మహారాష్ట్రులందు నే
నధిప! యుదరపోషణార్థ మకట!
పాదుషాకడఁ గొల్చి వంగివంగి సలాము
లొనరింపు చుండి నామనము నందు
నతఁ డొనరించు దుష్కృతములు సహియింపఁ
జాల కాతని కొల్వు లీలవీడి
రసపుత్ర రాజ్యసంరక్షణకర్త వౌ
భవదీయ సుగుణప్రశస్తి విని
తే॥ గీ॥ మిమ్ముఁ గొల్వంగ వచ్చితి మీ ముఖార
విందదర్శనమును జెంది డెందమందు
ముదము నందితి నంతయే మదిని వేఱు
భీతి నా కేల? మీకడ వేచి యుండ॥

భీమ—(లేచి) మహాత్మా! మీ రుగ్రజన్ములా?

ఉ॥ పావనమైన మీచరణపద్మములంటఁగ నెల్లపాపముల్
పోవిడిలెక్, మనంబు కడు మోదమునొందెను; జన్మమంతయుం
బావన మయ్యె; మీ రిటకు వచ్చుటచే సుదినంబు నేడు; భూ
దేవకులాగ్రగణ్య! భవదీయమనోరథ మిచ్చువాడ నే॥

భాదూల్—(లేచి) మహారాజా!

శా॥ నాకుం జూడఁగ దోఁచుచున్న దది యన్యాంబీతనిం గూర్చి మీ
రీ కంజాసనువక్త్రపల్కులకు నెక్కింత్తైన సంకోచముల్
లే కిట్లీ పగుఁ గొల్వునం గొనగఁ జెల్లెఁ గాక మీ కెంతయుల్
లోకుల్విన్నను దూషితంబగును మీలో నేమి యుంకించిరో ॥

మఱియు నీతండు తాను బ్రహ్మకులోద్భవుండని చెప్పినంతమాత్రమున నాతని గుణగణ జాలమును గులగోత్రములును నిక్కంబుగా నరయక మన జలవద్విరోధియగు చక్రవర్తి పాలనుండి యేతెంచిన నీతని పై వేషముఁ గనుఁగొని కొల్వునందు నియమించుట పాడియా? అదిగాక నాముఖ్యోద్దేశము నాలకింపుఁడు.

చ॥ అనిశము నా యపృష్ఠితితలాధిపుకొల్వునఁ జేరి, దేశమం
దునగల గుట్టుమట్టులను ధూర్తుడునై సకలంబు దెల్పి, స్వే
చ్ఛను విడనాడి, నీచత విచారణసేయని ఘాతుకుండునౌ,
మనుజునిఁ గొల్వులో బదులుమాటలఁ జెప్పక చేర్పవచ్చునే ॥

వసం.—భీమసింగ్ మహారాజా! పిన్నవయస్కుండగు నీతని పల్కులు పాటింపవలసినవి కావు. నే నల్లాయుద్దీనునిఁ జేరి దేశద్రోహంబు సంపాదించితినని యీతని యభిప్రాయము. అట్లెన్నఁడుఁ దలంపవలదు. స్వోదరపోషణార్థంబాతనిఁ గొల్చితినని యిది వఱకే విన్నవించుకొని యుంటిని. మరియు నేను మీకొనరించు సాయము ముందుముందు మీరే యెఱుంగగలరు. చక్రవర్తి గుట్టుమట్లు నాయొద్ద నుండుటచే మీరాతనినవలీలఁ జయించునట్లొనర్చెదను.

భీమ.—ధీరో త్తమా! బాదూల్ సింగ్జీ!
చం॥ వెఱవకు మంటి నీతని యభీష్టము: దీర్పక తప్పదింతటన్
సరసిరుహాప్త వంశజులు న్యాయవిశారదులార్తరక్షకుల్

వర శిబిచక్రవర్తి తన పక్కనుమాంసము గోసియిచ్చి పా
వురమును గావ డేగకు ప్రభూషితుఁడై యశము స్వహింపఁడో ?

కావున భూమ్యాకాశంబు లేకంబులైనను గావచ్చును గాని నేనాడినమాట దప్పువాఁడనుగాను. మధ్యాహ్నకాలం బతిక్రమించి నది. ఇఁకఁ గొల్వు చాలింతము.

---

## తృ తీ య రం గ ము.

### —* లక్ష్మణసింగు గృహము *—

( ప్రవేశము:— లక్ష్మణసింగు కూర్చుండి యుండును. )

( ప్రవేశము వసంతభట్టు. )

లక్ష్మ—( లేచి )

కం॥ ధరణీసురతిలకమ ! యి
త్తఱి నిట నిశయందు నెంతొ త్వరితగతిఁ వ
చ్చిరి మీర లెట్టి కార్యము
నరసితిరో తెల్పు డింక నధిక ప్రేమన్.

వసం— రసపుత్రకుమారా ! నే నిట్లతిత్వరితగతి నీ సన్నిధానమును
బున వచ్చుటకు ముఖ్యకారణం బొండుఁ గలదు.

తే॥ గీ॥ అరసివచ్చితి నేఁడు రహస్య మొకటిఁ
బ్రాణముల నీయఁగల్గు నపాయ మొనరఁ
గలదు మీ కర్థరాత్రిని, గాన మిమ్ము
శేషవిధములఁ గడఁగి రక్షింపఁ గలను.

లక్ష్మ—భూసురవర్యా ! అంతప్రాణోపద్రవకరమైన రహస్యవిశేషము
లుండెనా ?

వసం— అవును, నిశ్చయముగా మిమ్ము రక్షింపవలసి నంతటి యుపాయకరములగు విశేషంబులే యున్నవి.

లక్ష్మ— అయిన నా రహస్యవిషయంబు లేవియో తెలియింపరా?

వసం— నే నీ నిశాసమయంబున నరుదెంచినది యావృత్తాంతము నెఱింగించుటకే గదా.

లక్ష్మ—మంచిది.

వసం— బాదూల్ సింగు మీ కత్యంతాప్తుఁడుగదా!

లక్ష్మ— అందులకు సందేహ మేల? మా కతండు కేవల మాప్తుండు గాకపోయినను నతని రాజభక్తియు సన్మార్గత్వంబును విచారించి యాతని నాప్తునికంటె నెక్కువ ప్రేమతోఁ జూచుకొనుచున్నాము.

వసం— ఏమీ! యాతండు రాజభక్తుండుగా! (నవ్వును.)

లక్ష్మ— ఆతండు రాజభక్తుండేగాక యాతని మించు విశ్వాసపాత్రుండీ రసపుత్రశూరులలో నింకొకఁడు లేఁడు.

వసం— అంతటి ప్రభుభక్తుండును, విశ్వాసపాత్రుండు నగుటచే నాతండు మీపైఁ గుట్రలను బన్నుచున్నాఁడు.

లక్ష్మ— ఏమీ! యాతండు మాపై గుట్రలనుబన్నుచుండెనా? ఎవరిని గూడి?

వసం— మీకు బలవద్విరోధి యగు చక్రవర్తిని గూడి.

లక్ష్మ— ఆతఁ డెవ్విధంబునఁ గడుదూరమున నున్న చక్రవర్తితోఁ గుట్రలు చేయుచుండెను?

వసం— ఉత్తర ప్రత్యుత్తరంబుల ద్వారా
లక్ష్మి— ఇది సత్యమేగదా?
వసం— అవును. ముమ్మాటికి నిది సత్యమే.
లక్ష్మి—(క్రోధముతో) ఓరీ! పతంగవరకులకలశోకధిబస భానలా!
ఉ॥ మోసమొనర్ప నెంచి మము, భూవిభు మ్లేచ్ఛునితోడఁ గుట్రలన్
జేసి, మ తేమిలాభమును జెందెదవో రసపుత్రపాంసనా!
ద్రోసమటంచు నెంచవుగొ? ద్రోహి! కృతఘ్నుఁడ! క్రూర! యిట్టులం
జేసెదవంచు నెప్పుడును నీయెడ వేఱొకభావముంచమే.
వసం— ఇంతటితోనేమైనది ? మిమ్ము నెవ్విధంబుననైన నిర్మూలించి మీశిరంబును గోటిరయుక్తంబుగాఁ జక్రవర్తికిఁబంపసంసిద్ధుండైయున్నవాఁడు.
లక్ష్మి— ఏమీ! దుర్మార్గా! బాదూల్ సింగూ!
ఉ॥ శిరముందుగ్రించి తురుష్కనాథుకడకుం జేర్పంగనుంకించితే?
నరజన్మంబును నెట్లుఁ బొందితివి? నీ నైపుణ్యమేమందు మీ
పురి బాజారుల సంచరించు శునకంబుంబోలవే, నేఁటితో
సరి నీ కాయువుసుమ్ము భద్రమిక నీచా! నిన్నుదున్మాడెదన్.
అయ్యా! యేవిధంబుననైన మనమా రాజద్రోహినిఁ బట్టునుపాయంబు నాలోచింపవలయు.
వసం— కుమారా! నేనిదివరకే వానింబట్టువెఱవసితిని. ఆతండును, మఱికొందఱు కుట్రకారులును నీపురియందుండు పాడుగృహంబునకువచ్చి కుట్రలఁ జేయుచుందురు. ఈరేయి మనమువారికంటుపడకుండగా నరిగి వారినిబంధింపవచ్చును. నేఁడు భోజనంబైన తరువాత మీరుమాగృహంబునకు విచ్చేయుఁడు, కావలయుసన్నద్ధులగు సేవకులను గొందఱను వెంటఁదీసికొని పోవుదము,

లక్ష్మి— ఈసంగతి యేరికిని దెలియఁ గూడదు కావున మన ముభయులమే పోవుదము.

వసం— మంచిది. మీరు తప్పక మద్గృహంబున కరుదెంచవలయు. మనము వారి సేనాయి భీమసింగు మహారాజునకప్పగించుదము.

లక్ష్మి— అవును. సత్వర మట్లొనర్పవలయు. మీరు సిద్ధముగా నుండుడు.

వసం— అట్లనే యుండెదను.

(నిష్క్రమణము)



చతుర్థరంగము.

చిదానంద మఠము.

(ప్రవేశము:— చిదానందయోగి)

చం॥ పరివిమలవీరభోజ్యమగు రాజకులంబున నుద్భవించి, నే
భువిని విరాగివేషమును బూనియుఁ గ్రుమ్మరి దేశదేశముల్
చివరకు రాయబారినయి, శీఘ్రగతిం జనుదెంచి రాజపు
త్రవిభుని దుర్గమందలరఁ దాల్చగ నయ్యెను యోగివేషముల్.

చిత్తూరు నెప్పుడు చేరుదునాయని నిరీక్షించి నిరీక్షించి తుదకు, జేరనయ్యెను. రామదేవుం డొసంగిన యుత్తరంబులు మార్గమధ్యంబునఁ జోరవర్గవశీకృతములౌటచే నాతనిసందేశమును భీమసింగు మహారాజున కెఱింగించుటకు వీలు లేకుండెను. అయినను రసపుత్రశూరులతో నెయ్యంబు సంపాదించితిని. నాశిష్యవర్గంబులఁ బనిచి చిత్తూరునం

గల రహస్యవార్తల వారిద్వారా యెఱుంగుచుంటిని. ఈరాత్రి వసంతభట్టు లక్ష్మణసింగును ఢిల్లీకి ఖైదీగాఁ దీసికొనఁబోవుటకు సిద్ధంబుగా నుండెనని నాశిష్యులు తెలియఁజేసిరి.

(ఆలోచించి) ఏమీ! బాదూల్‌సింగు బ్రాహ్మణవేషంబున వచ్చుట కాలస్యంబయ్యెను.

(బాదూల్‌సింగు ప్రవేశము. బ్రాహ్మణవేషముగ)

తే॥ గీ॥ వందనము వందనము చిదానందయోగి
వర్య! ధీనిధి! సన్మార్గవర్తనుండ!
భావికాలవివేచనపరుఁడ! గురుఁడ!
పరమభాగవతోత్తమా! బ్రహ్మతేజ!

స్వామీ! నన్ని యర్ధరాత్రియందు బ్రాహ్మణవేషంబున రమ్మనుటకుఁ గతంబేమి?

చిదా—బాబా! నీ వాయుధపాణివై వచ్చితివా?

బాదూల్—ఎందులకు? నేనెవరినైన వధింపవలెనా? స్వామీ! మీరెవ్వరోయిట్టి వేషంబుననుండుటకుఁ గారణంబెద్దియో యెఱింగింపఁ జేయఁ బ్రార్థించుచున్నాఁడ.

చిదా—నేనెవరినైనది కతిపయదినంబులలో మీకే తెలియఁగలదు. అయినను నీ వడిగితివిగానఁ జెప్పెద వినుము.

ఉ॥ ఉత్తరహిందుదేశమున నుత్తమరాజకులోద్భవుండనై
చిత్తురురాజ్యరక్షణకుఁ జేయుచునుంటిని సాయమెంతయో
యిత్తరి నిట్టివేషమున నిచ్చటనుండఁగఁ గద్దు కారణం
బిత్తఱిఁ జేయనున్నపని యెంతయు దుర్లభమౌను మిత్రమా॥

కావున నేఁజెప్పిన ట్లొనరించితివేని శాత్రవాణంబులకైన ఖాళీ జేసి సునుగాపాడెదను.

బాదూల్—ఏ హా! మీరు క్షత్రియులా! అట్లయిన మీ కత్యంత విధేయుఁడనై కార్యము నిర్వహించెదను.

చిదా—అట్లయిన ధైర్యంబవలంబించి నన్ను వెంబడించుము. ఈ మాఱుమూలలన్నియుఁ గడచి గమ్యస్థానము సమీపించితిమి. (తెరయెత్తఁబడును. పాడుగృహమునందు లక్ష్మణసింగు వసంత భట్టు నిలుచుండియుందురు.)

అదిగో పడునదే మనకుఁ గావలసిన పాడుగృహము, నేను 'జయకాళీ' యనునప్పుడు నీ ఖడ్గం బుపయోగించుము. అంత వరకు దాఁచియుంచుము. నీ విచ్చట నుండుము. వారువచ్చిరే మో చూచివచ్చెదను. (కొంచెము లోనికిఁబోయి మఱల నెప్పటి స్థలంబునకువచ్చి) కుమారా! వా రిచ్చటనేయున్నారు. నేను వారి సంభాషణంబును వినివచ్చెద. నీ విచ్చటనే యుండుము.

(అనికొంచెము ముందుకునేగి పొంచియుండును.)

లక్ష్మ—అయ్యా! వారింకను రాలేదు. కారణమేమైయుండును? నేఁ డాకవేళ వారు రాకుందురేమో. నిరర్థకముగా నన్నేలఁ దో డ్కొని వచ్చితిరి?

వసం—కుమారా! వారువచ్చెడి కాలమైనది. బాదూల్‌సింగీ రేయి మిమ్ములఁ నిరీక్షింప సిద్ధుండై యున్నాఁడుగదా! వానిచే బహు కొండ మెలఁకువగా నుండుడి. భయపడవలదు.

లక్ష్మ—భయమా! నా చేతఁ గత్తియున్నంతవఱకు నా కేమియు భయములేదు. వినుము.

శా॥ చేతం ఖడ్గముఁ బూని ఘోరరిపులం జీకాకు నొందింప, ని
ర్భీతిన్ దేవవిభుండు రుద్రుఁడు వడిన్ విధ్వంసి నిర్వ్యాంగ, సం
ప్రీతిన్ సంగరమందుఁ దూల్పఁ గలరే! పృథ్వీస్థలిన్ క్షత్రులై
భీతిం జెందరు వారిజాప్తకులజుల్ పృథ్వీసురా! ధీవరా!.

వసం.—కుమారా! వారు కుట్రలఁ జేయుటకు నిశ్చయించిన వత్తురు లేక యూరిబైటనుండు మామిడితోటకైనఁ బోదురు. అచటి కేమయిన వెళ్ళియుండి రేమో.

లక్ష్మ.—అట్లయిన మన మచ్చటికే పోవుదము.

వసం.—అట్లనే పోవచ్చునుగాని నాకొరకు సేవకుండొకఁడు రావలయు. వాఁడు వచ్చెనేమో చూచివచ్చెదను. (అని బైటికివచ్చును.)

చిదానందయోగి (బాదూల్ సింగుతో)

బాబా! బ్రాహ్మణుఁడు వచ్చుచున్నాఁడు ప్రక్కకు పోవుదము. (అట్లు చేయుదురు.)

(ప్రవేశము—ఆనందుఁడు.)

వసం.—ఆనందా! విశేషము లేమి? అన్నియు సిద్ధము జేసితివా!

ఆనం.—అన్నియు సిద్ధముఁ జేసితిని. బండిబ్యాఁడును, శంకరయ్యఁడును, తోటయొద్ద నాయుధపాణులై తయారుగానున్నారు. చక్రవర్తియొద్దనుండి పాండురంగనాథుండు వచ్చియున్నాఁడు. [illegible] యుత్తరములఁ దెచ్చినాఁడు. అతఁడు గోకులమఠములో జ్ఞానానందస్వామి యను పేర నున్నాఁడు.

వసం.—మంచిది. ఉత్తరము లాతనియొద్దనే యుండనిమ్ము. రేపు చిత్తూరునందలి వార్తలాలకించి యాతఁడు ఢిల్లీకి వచ్చును.

నీవు పొమ్ము. ( లక్ష్మణసింగు కడకువచ్చి ) కుమారా! వారు తోఁటలోనికి వచ్చిరఁట. మన మచ్చటికిపోదము. (అని ప్రక్క తెరలోనికిఁ బోవుదురు. )

చిదా.—కుమారా! వీ రూరిబైట తోఁటలోనికి బోవుచున్న వారు. మన ము వీరిని వెంబడించి పోదము. (అని యింకొక ప్రక్క తెరలోనికిఁ బోదురు. చెట్లతెర వ్రాలును.)

(ప్రవేశము:— వసంతభట్టు, లక్ష్మణసింగు).

వసం.—కుమారా! వారు వచ్చిరేమో చూచి వచ్చెదను. వారికంటఁ బడకుండ మీ రీ బండిలో నెక్కుఁడు.(అని వెలుపలికి పోవును.)

లక్ష్మ.—హా! దైవమా! నిశాసంచార మెన్నం డెఱుంగని నే నీ బ్రాహ్మణుని మాటలునమ్మి సహచరసమేతుఁడై యున్న సీతని వెంట నేకతంబ యేల వచ్చితిని? ఈతని రహస్యాలోచనలను జూడ నీతఁ డెద్దియేని కృత్రిమఁ దలపెట్టెనని స్పష్టమగుచున్నది.

( ప్రవేశము —వసంతభట్టు.)

లక్ష్మ.—

చ॥ పరులు, మదీయమస్తమును: బంప.గ నుండెరి చక్రవర్తికిన్
సరగున నంచుఁ జెప్పి "తఱుణంబున వారిని నేఁడె పట్టి భూ
వరునకు నప్పగింత" మని బాలకుఁడన్ ననుఁ దెచ్చి చంప భూ
సుర! తలపెట్టితే యకట! సుంతయు ద్రోహమటంచు నెంచవో!

వసం.—నేను నిన్నిప్పుడు ఢిల్లీకి ఖైదీగాఁ గొంపోవుచున్నాను. నీవు పౌరుషము గల రాజపురుషుండవైతి వేని నిన్ను నీవు గాపాడుకొనుము. పారిపో నెంచితివా నీప్రాణంబులు దక్కవు. ( అని కత్తి జళిపించి లక్ష్మణసింగును మెడ. బట్టుకొనును. వెంటనే

లక్ష్మణసింగును గ త్తిఁదీయును. బండీనడువ సిద్ధంబైయుండును.
(ఆయుధపాణు లయిన శంకరుఁడు ఆనందుడు ప్రక్కన నుండును.)

చిదానందయోగి (తెఱలో)

చ॥ త్వరపడు మోకుమార! మనబాలకు లక్ష్మణసింగు నిప్పుడీ
సురుఁడు వసంతభట్టు మది సుంతయు జంకక డిల్లికిన్ సరా
సరిఁ గొనిపోవుచుండె నిఁక సత్వర మా రసపుత్రులఁ గావుమా

బాదూల్ సింగు (తెఱలో)

చం॥ నిలునిలు మోదురాత్మ! కఠినీచపథస్థుఁడ! బుద్ధిలేదె? ని
శ్చలత వధింప నెంచితివె? జంకక లక్ష్మణసింగు నిప్డు నిన్

(ప్రవేశించి)

బలి నిడు దీక్ష్ణపాణమునఁ బట్టెడబోకు వసంతభట్ట! స
త్కులమున నుద్భవించితివె! క్రూర! నిశాటుఁడ! బ్రాహ్మణాధమా!

(అని వసంతభట్టును దన్ని క్రిందబడవేయును. బండివాఁడును
సేవకులును బారిపోవుదురు.)

చిదా.—

చం॥ కరుణ యొకింత లేక జయకాళి! ధరామర జంపుమీ వెసన్

(బాదూల్ సింగు వసంతభట్టును జంపును.)

లక్ష్మ— (బాదూల్ సింగుకడకు వచ్చి)

కం॥ అవనీసురుఁడవొ! నరుఁడవొ!
భువనములను నేలువిష్ణుమూర్తివొ! సాక్షా
చ్ఛివుఁడవొ! నాపాలిటిఁ ధా
తవొ! యిచ్చితివయ్య! ప్రాణదానము నాకున్ ॥

నేను కృతజ్ఞతాపూర్వకముగా నిచ్చు నీ ఖడ్గరత్నంబును స్వీకరించుము. (అని బాదూల్‌సింగునకు ఖడ్గంబిచ్చును)

బాదూల్ — అయ్యా! నే నెవరైనది రేపు దర్బారునందు మీకే విశదంబగును. ఈ రీ రేయి మాతో వచ్చి చిదానందయోగి మఠంబున నిద్రించి రేపుదయంబున మీభవనంబున కేగుఁడు.

చిదా — (బాదూల్‌సింగుకడకు వచ్చి) కుమారా! పాండురంగనాథుండఁట, జ్ఞానానందస్వాములవారనుపేర గోకుల మఠంబున నున్నవాఁడఁట, వసంతభట్టునకుఁ జక్రవర్తియొద్ద నుండి యుత్తరంబు లెవ్వియో తెచ్చినాఁడఁట. మనము వాని గూడ నిర్మూలించి లేఖల సంగ్రహించుదము.

(అందఱు నిష్క్రమము.)

---

పంచమరంగము.

లక్ష్మణసింగు మహారాణా దర్బారు.

(ప్రవేశము:- లక్ష్మణసింగు, భీమసింగు, ప్రతాపసింగు, జయసింగు, అజేయసింగు, దుర్గసింగు, సమరసింహుఁడు, సాగరసింహుఁడు.)

లక్ష్మ — భీమసింగు మహారాజా! రసపుత్రశూరులారా! మనచిత్తూరు దుర్గంబుపైఁ జక్రవర్తి దండయాత్ర విషయమయి యథార్థస్థితి నెఱుంగఁగోరి మిమ్ము సభకు రావించితిని. తద్విషయమై యావద్వృత్తాంతము నిన్నటిరాత్రి మాకు విశద మయినది. బాదూల్‌సింగు గోరాసింగు లేలనో నేఁ డింకను రాకుండిరి.

(ప్రవేశము):— గోరాసింగు, బాదూల్‌సింగు, బంధితుఁడైన పాండురంగనాథుండు.)

గోరా—రాణాగారూ! భీమసింగుమహారాజా!

ఉ॥ ఎవ్వని సత్ప్రభుండని గ్రహించియు నుంచిరొ కొల్వు నందు మీ
రెవ్వని వాక్యమత్యమృతిని నెప్పుడు గొప్పగఁ జెప్పుచుందురో
యవ్వసుధామరాంకమున కాతుర కాధిపుఁ డంపు లేఖల
ఖివ్వున జేర్చుచుం డితఁడు నిత్యము సంయమి వేషధారుడై!

ఈతండు పాండురంగనాథుం డఁట. చక్రవర్తికడ నుండి కొన్ని యుత్తరములను దెచ్చి వసంతభట్టున కొసంగుటకు జ్ఞానానందులనా రను పేరుతో గోకులమఠంబున నుండి నిన్న రేయి మాచే బట్టు వడెను.

భీమ— (పాండురంగనాథుని జూచి) నీ విందుల కే మనియెదవు?

పాండు—అయ్యా! నేను మీ కెట్టి ప్రత్యుత్తరంబును జెప్పను. మీ యిష్టము వచ్చినట్లుఁ జేయుఁడు.

భీమ— గోరాసింగ్జీ! అయిన వీనిని దక్షిణము తాళ్లకుఁబంపుము.
గోరాసింగ్జీ! వసంతభట్టెట్టివాఁ డనుటకు సందియము బొడము చున్నది.

గోరా— మహారాజా! ఆవసంతభట్టెంతటివాఁడనుట కీయుత్తరంబులే సాక్ష్యంబులు. (అని యుత్తరము లిచ్చును.)

భీమ— (ఉత్తరమును బుచ్చుకొని) ప్రతాపసింగ్జీ! యీయుత్తరముఁ జదువుము.

ప్రతాప— (ఉత్తరముఁ బుచ్చుకొని)
డిల్లీ పాదుషా యల్లాయుద్దీనుఁడు ప్రియ మిత్రుండగు వసంత భట్టునకు వ్రాయుసంగతులు. నాడు నీతో నేనుకపటకలహము గల్పించుకొని నిన్నుఁ జెఱసాలయందుంచి మనుజుల విముక్తుని

జేయుటాదిగాఁగలుగు విషయము లింతవరకు నేటికినిఁదెలియ వు. నీవు రాజపుత్రుల యొద్దకుఁ జేరి వారి నెట్లైనఁ గను బ్రామటకు సకలప్రయత్నంబుల జేయుచున్నావని చారులచే విని చాల సంతోషించినారు. మఱియు జగ్గూసదాసయాత్ర విషయమై యసత్యంబని వారికి నొక్కి చెప్పి వారలేమఱియుండు సట్లొనర్చ వలయు నీవు లక్ష్మణసింగురాణాను మోసపుచ్చి ఢిల్లీకిఁదైదీ గాఁ గొనిపోవ వచ్చుటకు నుద్యమించుచుంటివని దెలిసినది. సాధ్య మైనంతవఱ కాతనిని జీవముతోనే తీసికొని రావలయు.

ఇట్లు నీమిత్రుఁడు,
అల్లాయుద్దీనుఁడు.

లక్ష్మ— భీమసింగుమహారాజా! రసపుత్రశూరులారా! వసంతభట్టు మనకొల్వునఁ బలుటకు దిక్కైయె పర్తించు కతన మన మాతండు ట్టివాఁడని గ్రహింపలేకయుంటిమిగాని నిన్నరాత్రి

సీ॥ "మర్మార్గుఁడగుచు బాదూలుసింగిట కొంద
ఱినిఁ గూడి గుట్టుగై యనిశ"మంచు
"నిన్ను దాగించియుఁ దల క్రిన్నసఁ జక్రవ
ర్తికిని బాపుదురు కానుకగ"ననుచు
నన్నుఁగొంపోయి యానిశిరేయి నొక్కనిఁ
జెఱఁబట్టి ఢిల్లీకినరుగఁ గోరి
శకటంబు నెక్కించి సరగునఁ గొంపోవ
సాగుచోఁగత్తి హస్తమునఁ బూని
తే॥ గీ॥ నేను దప్పించుకొనఁ బ్రియత్నించునపుడు
నాదుప్రాణంబు లపహరింపఁ గడంగ
ఖడ్గ మెత్తిన యంతలో ఘనుఁ డొకండు
వచ్చి యాతనిఁ జంపి కాపాడె నన్ను

అట్లు నాకు ప్రాణదానం బొసంగిన మహాత్ముఁ డెవ్వఁడో గదా!

బాదూల్—(లేచి)

ఉ॥ మోసమొనర్చి మిమ్ముఁ గొనిపోవఁగఁ జూచిన బ్రాహ్మణాధముఁ
భూసురవేషధారి నను జేరి భయంబున దర్పమొప్పఁగా
గాసిలఁ జేసి కత్తికెరఁగా నొనరించినవాఁడ నేనె మీ
రాసమయంబునం దొసఁగినట్టి కృపాణ మిదే ధరాధిపా!॥

భీమ—(లేచి, బాదూల్‌సింగును కౌఁగిలించుకొని)

శా॥ నానాభంగుల గన్నుఁ బ్రాముఁ, మనరాణాగారినిం బట్టి యా
భూనాథాధముపాలి కంపి కపు సమ్మోదంబుఁ జేకూర్పఁగా
హీనాత్ముం డిలపెట్టినట్టిఖలు నాపృథ్వీసుతుం జంపి, యీ
రాణావంశము నిల్పఁ బెట్టితివె కుమారా! నీవు శౌర్యోద్ధతిన్॥

అని తనచేతిలోని హార మతని మెడలో వేయును.

లక్ష్మ—భీమసింగుమహారాజా! సభికులారా! ఈయుత్తరంబులను బట్టి విచారింప తప్పక యల్లాయుద్దీనుఁడు మన చిత్తూరుదుర్గంబుపై దాడివెడలుట నిశ్చయమని దోఁచుచున్నది. దీనికిఁ దగు ప్రతికృత్యం బేమై యుండును?

భీమ—లక్ష్మణసింగ్జీ! ప్రతికృత్యం బేమియున్నది? తురుష్కనాథుఁడు మన దుర్గలక్ష్మిని వశపఱచుకొనఁ జాలనట్లు దుర్గపరివేష్టితంబగు పరిఖలను శత్రుహృచ్ఛేదనంబు లగునట్లొనర్పవలయు. గోపురప్రాకారాట్టాలకంబులను బ్రతిపక్షనిశ్ఛేదితంబులగునట్లు బలపఱచవలయును. చతురంగబలంబుల నెల్లను యుద్ధంబున కాయత్తపఱచవలయును.

గోరా—రాణాగారూ! ఆయల్లాయుద్దీనుండు సకలసైన్యసంధాన సమేతుండై

సీ॥ గగనప్రచుంబితాగ్రసమేత ధాత్రీధ
రముల మిక్కిలి ప్రయాసమున దాఁటి
క్రూరసత్వవిహార ఘోరమహా దుర్గమా
రణ్యభూములను ధైర్యమున దాఁటి
భీషణధ్వానమహోర్మికరాంబుధితుల్య
కూలంకషములు లవలీల దాఁటి
తీవ్రాతపవ్యాప్తదీప్తవిస్ఫుటసై
కతతలంబుల మహోగ్రతను దాఁటి;

తే. గీ॥ అసురదుస్సాధ్యమైన దుర్గమును నిశిత
ఘోరశస్త్రవిద్యాప్రదక్షు లగు రసకు
మారవరాత్మభూమి యగు చిత్తూరుదుర్గ
రాజమును ముట్టడింప దుర్బలులు సుజను॥

జయసింగు—ధాత్రీధవాగ్రణీ! గోరాసింగు నిశ్చయించిన విధంబున నా తురుష్కనాథుండు చిత్తూరుదుర్గంబును ముట్టడింప నసమర్థుండను మాట నిక్కువంబు. కాక యాతండు మార్గమధ్యాగతంబులై యనితరోపాయసాధ్యంబు లగు నాటంకంబులను లక్ష్యముఁ జేయక దాఁటి వెడలినయెడల మొట్టమొదట రాజపుత్రస్థానంబున కీశాన్యప్రదేశ సంరక్షణకరంబు లగు "నాలివార్ భర్తపురి" దుర్గంబుల గడచికదా రావలయును.

ప్రతాప—రసపుత్రక్ష్మాతలాధ్యక్షాగ్రణీ! రిపుక్షోణీశుం డగు నల్లాయుద్దీనుండు.

మ॥ సకలారణ్యనదీమహీధరభయాశ్చర్యప్రదక్షోణి ను
త్సుక మొప్పారఁగ దాఁటి దేవగిరినాథుం డేలు దుర్గంబు భం
గకృతంబుం దగఁ జేసి యింక మనదుర్గశ్రేష్ఠముం బట్ట సై
నిక సంఘంబులతోడ దాఁడి వెడలు న్నిక్కమ్ము ముమ్మాటికిన్॥

సమరసింహుఁడు—భూధవచంద్రమా! ప్రతాపసింగు వారిచ్చిన ట్లాతం డాల్వాయు భక్తపురి దుర్గంబులఁ జయించినను, వీరాధివీర వాస్తవ్య ప్రాంతంబులగు జయపురి ఖోల్పురి దుర్గరాజంబుల స్వాధీనం బొనరించుకొని ప్రాణములతో వచ్చుట యసత్యము.

దుర్గసింగు— రాజాగ్రణీ!

సీ॥ వడి దేవగిరికోట స్వాధీన మొనరించు
కొన గడంగు నపుడు కొంతసేన
ఢిల్లీనగరముపై ఢీకొన్న మొగలాయి
కోట్ల జయించుచో గొంతసేన
తనపైన దిరుగఁబడిన తురుష్కుల ఘోర
సంతతు లడచుచోఁ గొంతసేన
అవనీధవులను బాదాక్రాంతులను జేయఁ
గోరి జయించుచోఁ గొంతసేన

తే॥ గీ॥ ఇట్లు నిజసైన్యసంఘంబు లెల్ల సంగ
రంబు లందునఁ గోల్పోయి డంబుదక్కి
దుర్బలుండైన తురకనాథుండు వేగ
వచ్చి చిత్తూరు ముట్టడింపఁ గలఁడె?॥

సాగరసింహుఁడు:—భూపాలచూడామణీ. దేశనిహతిశేషంబులగు స్వల్పసైన్యంబులతో నల్లాయుద్దీనుండు స్వశక్తి పరశక్తుల గ్రహింపక ధైర్యంబునఁ జిత్తూరుదుర్గంబుపై దాడివెడలుట ముమ్మాటికి నసత్యంబు. అట్లుగాక యతండు మార్గమధ్యంబు నందలి దుస్తరకార్యంబుల నెల్ల నిర్వహించుకొనియో లేక శైలారణ్యానదీ ప్రదేశంబుల దాఁటియో కొంతవఱకే తెంచినను చిత్తూరున కుత్తరంబున నుండు మేరభూమిని గడచి రావలయును. అచ్చటి దుర్గంబులఁ జయించుట కల్ల. అట్లుగాక యతండారావలీపర్వత

పంక్తికికని బీరప్రదేశంబునకు మధ్యనుండు గిరిగహనమార్గం
బులనుండి రా నుంకించినం దత్ప్రాంతవాస్తవ్యులగు భిల్లవర్గ బుల
నిర్మూలించి వచ్చుట దుర్లభంబు.

బాదూల్ — క్షోణీతలాధిపా !

శా॥ అక్షీణోగ్రతరప్రతాపమున జన్యక్ష్మాతలంబందు శ
త్రుక్షోణీశవగర్వభంజనసమర్థుల్ సూర్యవంశోద్భవా
ధ్యక్షుల్ శ్రేష్ఠ యటంచు మ్లేచ్ఛవసుధాధక్షుల్యం డెఱుంగుగా గదా
కత్తుంబూనియు నాత డింక మనదుర్గప్రాంతముం జేరునే॥

ఒకవేళ నామూర్ఖుం డత్యాశాయుక్తచిత్తుండై చిత్తూరుదుర్గం
బును ముట్టడించినను దురుష్కసైనికులు

సీ॥ జలరాశితుల్యమై శత్రుహృద్భేద్యమై
పొంగారుపరిఖను బూడ్పం గలరె?
యతివిశాలంబు లై యభ్రంకషంబులౌ
ప్రాకారములను గూల్పం గలరొక్కొ?
బుధజననిర్మిత భూమ్యంతర రహస్య
మార్గంబులను గ్రహింపంగల రొక్కొ?
ప్రజ్వరిల్లు రసపుత్ర శరాగ్నియందు భ
స్మీభూతములుగాక చెలంగం గలరె?

తే॥ గీ॥ కాన భయ మేల మన కింతః గ్రాలుసుతులం
గనదె చిత్తూరుపురలక్ష్మి? కదనమునకు
సర్వసిద్ధులమై శత్రుసైన్యసంఘ
ములను గెల్వంగ యత్నముల్ సలుపవలయు॥

అజేయసింగు:—

రాజేంద్రా! బాదూల్ సింగు చెప్పిన ప్రకార మా యల్లాయు
ద్దీనుండు మనపై దాడి వెడల కుండుట యసత్యంబు. ఒకవేళ సాహసించి

వచ్చినను మన దుర్గంబును స్వాధీనపఱచుకొనునని కలలో సైతఁ దలంప వలదు.

(ప్రవేశము-చిదానందయోగి)

చిదా.—మహారాణాగారూ! భీమసింగుమహారాజుగారు! రాజపుత్ర యోధులారా!

చం॥ బవరము డాయ వచ్చె రిపువార్ధితరంగము లేకమై మహా
రవమున వచ్చుచుండె నిఁకఁ బ్రజ్ఞలు పల్కుట కాదు వారి నా
పవశమె మీర లివ్విధిని వ్యర్థులకై వడి మిన్నకుండినన్
ఁవరకుఁ జేటు కాలమునఁ ఁంతిలు వారలు నిష్ఫలంబుగన్॥

మ॥ (పంచపాది)
కరవాలంబును జేతఁ బట్టినది సంగ్రామస్థలిన్ దోర్బలా
కరులై శత్రుల రూపుమాపుటకు నై కాదే విచారింపగన్
ధరణీపాలురు దేశరక్షణకు మున్ సంగ్రామరంగంబు లం
దుర కాష్ఠేశుల నోడఁజేసి జయముం బొందంగ లే దొక్కొ- మీ
కరవాలంబులు రిత్తఁబుచ్చి రిపులన్ ఖండించలే రేలొకో॥

మీర లందఱును సమరసిద్ధులై యుండవలయును. చక్రవర్తి సకలసైన్యంబులతోఁ జత్తూరుపై దాడివెడలి నాఁడు.

(ప్రవేశము-సేవకుఁడు)

మహారాజా! ఎవఁడో తురకవాఁడొకఁడు వచ్చియున్నాఁడు.

భీమ.—తురకవాఁడు వచ్చియుండెనా? త్వరలో నాతనిఁగొనిరమ్ము.

(ప్రవేశము-తురకవాఁడు.)

తురక.—భీమసింగు మహారాజా! అల్లాయుద్దీను పాదుషాగారు మీతోఁ గొన్నిమాటలు జెప్పు మని నన్ను బంపెను.

భీమ—మంచిది. అయిన వారిప్పు డెచ్చట నున్నారు.

తురక—ఇప్పటికి సుమారు పదునైదు క్రోసుల దూరంబులో నున్న వారు.

భీమ—రసపుత్రశూరులారా! వింటిరా యల్లాయుద్దీనుండు మనపై దాడివెడలి వచ్చినాఁడఁట.

గోరాసింగు—రాజేంద్రా! యల్లాయుద్దీనుండశేషసైన్యసమేతుండై రానిండు.

సీ॥ రిపుసైన్యరక్త వార్నిధియందుఁ దరణినై
రిపుఁడన నే సంచరించు వాఁడ
పంచ మహాపాతకులతో రిపులను
దండధరుండనై చెండు వాఁడ
బ్రతిపక్ష కాలసర్ప వ్రాతములను బ
క్షీంద్రుండనై వధియించు వాఁడ
గరినాశాత్రవాతగాఢాంధకారంబు
భానుండనై రూపు బాపువాఁడ
తే॥ గీ॥ నందియుంబోల నిశితశస్త్రంబుఁ బూని
శాత్రవానీకములు భయాశ్చర్య చిత్తు
లై నిజాయుధముల వీడి యతిరయమునఁ
బాఱిపోవంగఁ జేతునే పార్థివేంద్ర॥

జయసింగు—క్షోణీధరేంద్రా! రిపుహృత్రలాధ్యక్షాధముండైన యల్లాయుద్దీనుండు సకలాక్షౌహిణీ సమేతుండై యెదురులేక కదనంబున కరుదెంచనిండు. రాజపుత్రయోధవీరులచే రువ్వంబడిన శిలాప్రవర్ష ఘాతంబులనుండియు శరాగ్నిజ్వాలలనుండియుఁ బ్రతికియుండినగదా దుర్గంబును స్వాధీనంబొనరించుకొనుట!

ప్రతాప—ధరాతలాధిపా! తురుష్క-నాథుండు యవన, పారశీక, తురుష్క-, మ్లేచ్ఛ సేనలతోఁ గోటను ముట్టడింప నిండు. నేను మత్సైన్యసమేతుండ నై

క॥ అక్షీణబలంబున జ
న్యక్షోణీతలంబు నందు నరివర్గములన్
శిక్షితులను జేసెద నిటు
లాక్షుని వలె నుగ్రమూర్తి నై సత్వరమే.

సమరసింహుఁడు—రాజాగ్రణీ! తురుష్కాధిపుండు సరగున నరుదేరునుగా! తురుష్కులు చంద్రధ్వజు లని యాచంద్రార్కంబు సహాయభూతుండై సంగరంబునకు విచ్చేసినను సకీ నిస్తంద్రప్రతాపంబున నాచంద్రధ్వజులను జంద్రసమేతంబుగాఁ బరాభూతులఁ జేసెదను.

దుర్గసింగు—రాజపుత్రాధిపా! తురుష్కనాథుండు యుద్ధంబునకు రానిండు.

ఉ॥ బాకునఁ గుర్మెద్దర్ రిపుల వ్రచ్చెద మత్కరవాలధారఁ బ
ద్మాకర మందు మత్తగజ మాతురతం బసి వే మృణాళముల్
భీకరలీలఁ దుండెములఁ బ్రీతిని జేయు గతిం దురుష్కులన్
డీకొని మస్తముల్ దునిమి నేఁ జిరియించెద సంగరంబునన్॥

సాగరసింహుఁడు— రాజపుత్రాధిపాగ్రణీ ! తురుష్కసైన్యవార్ధితరంగంబు లేకమై చిత్తూరుపై పొరలి రానిండు. నిముషమాత్రంబున మత్ప్రతాపభీకర ప్రభాకీలలచేఁ దురుష్కసైన్యవ్రాతంబును నామమాత్రావశేషం బొనరించెద.

బాదూల్—రాజపుత్రభూపాలచూడామణీ! ముష్కరాధ్యక్షుం డగు నాతురుష్క క్షితితలాధ్యక్షుండు స్వపక్షవిపక్షప్రతాపదక్షతా

భేదంబుగ్రహింపక సుక్షత్రియానీకంబులపైఁ గత్తిం బూని సకలాక్షౌహిణీసమేతుండై జన్యక్షోణీస్థలంబునఁ బ్రత్యక్షంబు గానిండు.

సీ॥ దుర్మార్గమతులైన తురకాధములఁ బట్టి
సింహంబు గ్రసించు పొల్పువాఁడ
రణకుతూహలుఁడౌ తురకసైన్యముల యందు
జచ్చర పిడుగునై చెలఁగువాఁడ
ఘోరున నెదురైన సముద్ర-రాధము లందు
బ్రళయానలము భంగి నెగసెలువాఁడ
మృత్యుదేవతఁబోలె మ్లేచ్ఛసైనికు లందఁ
జేరి దిగ్బ్రమ మూఁకఁ జేయువాఁడ
తే॥ గీ॥ కదనకేళిని నిశిత ఖడ్గమును బూని
తెగఁబడి రిపుల హస్తముల్ ద్రెళ్ళవేసి
సాగరాంబుధి నీదియు భంగిఁ బఱతు
పాదుషా భీతచిత్తుఁడై పఱువఁగ॥

అజితసింగు — నృపాలతిలకమా! శాత్రవానీకంబులు చిత్తూరును ముట్టడించిన నేమి? ద్వాదశార్కులంబోలు మా భ్రాతృద్వాదశ ప్రభాకీలలఁబడి శత్రుకుమాధీశుండు మఱలఁ బ్రతికివచ్చినగదా దుర్గలక్ష్మిని స్వాధీనం బొనర్చుకొనుట!

చిదానందయోగి — రసపుత్ర భూమండలాధిపా! యా తురుష్క-శుండాలంబులు మండితాఖండభూతులగు ప్రచండమార్తాండవంశోద్భవులపై దండు వెడలిన నేమి?

సీ॥ రణవనీస్థలిని గోరాసింగ మార్చిన
యవనమదేభంబు లవనిఁ బడవె?

బాదూల్ కరీంద్రంబు ప్రధనభూమినిఁ జొచ్చఁ
దురక మృణాళముల్ దూలిపోవె ?
దుర్గ శార్దూలంబు దురమునఁ జెల రేఁగఁ
జాంబీక మృగముల్ బరుగు లిడవె ?
ఉగ్రప్రతాపసూర్యుని శరాగ్ని నిమ్మేచ్ఛ
సైన్యశలభతతుల్ సమసి పోవె ?
తే॥ గీ॥ చక్రివర్తియెగాదు భూచక్ర మేలు
కమలనాభుఁడు వచ్చి సంగర మొసర్ప
భంగఁబుత్తురుమీర లెభ్భంగి చక్రి
వర్తి చిత్తూరు దుర్గంబు బట్టఁగలఁడు ?

భీమ.—(తురుష్కుని వంకకుఁ దిరిగి) తురుష్కనాయకా! అల్లాయుద్దీనుఁడేమని చెప్పుమనెను ?

తురక.— మహారాజా! చక్రవర్తిగారు మీతోఁ నిట్లుఁ జెప్పుమనెను. “ఏల మీరు వృథాజనవినాశముఁ జేసికొనెదరు ? మాకు బాదాక్రాంతులై కప్పము నిచ్చునట్లొడంబడితేని దుర్గంబును ముట్టడింపకయే పోవుదుము. అట్లొడంబడరేని మీ దుర్గంబును నిర్మూలించి మహారాష్ట్రులను బోలె మిమ్ముఁబాదాక్రాంతులఁ జేసికొనెదను.”

భీమ.—(కోపముతో) ఏమీ! చక్రవర్తికిఁ బాదాక్రాంతుఁడను గావలెనుగా ?

సీ॥ ప్రళయదావానల జ్వాలావృతోగ్రసం
గ్రామసంచార శంకరనిభుండ
దారుణారాతి ఘోరారణ్యసముదగ్ర
పటుతరచటుల వైశ్వానరుండ

సమరకాంతారసంచర భీకరారి మ
త్తేభసంహార సింహేంద్రనిభుఁడ
సమదగర్వోన్మత్త శాత్రవకుంభినీ
ధరగర్వభంజన సురసముఁడ
తే॥ గీ॥ నిట్టి రవికులశ్రేష్ఠుఁడ, గట్టిడి మును
తురకనాథున కోడి చిత్తూరు నందు
మానధనమును గోల్పోయి హీనమతిని
కప్పమును గట్టువాఁడ నా యొప్పిదముగ॥

అల్లాయుద్దీనుఁడు మద్యపానమదమానసపరిమత్తుండై

సీ॥ సుక్షత్రియులు తాను జుల్కనగాఁ జూచు
పుడమి నేలుపులంచు మురసినాఁడొ
మాతోడ రణకేళి మానినీమణులతో
సరసమాడుట యంచు సరసినాఁడొ
మారణభేరుల భూరిశబ్దంబులు
వాద్యంబు లని పొరబాటు వడెనొ
మాకోటఁ బట్టుట మఱి దేవగిరికోటఁ
బట్టుటఁ యంచు విభ్రమమువడెనొ;
తే॥ గీ॥ దర్పమునఁ జిత్తోడ్ కోటపై దాడివెడలఁ
గడఁగి వచ్చునో పొడఁగనుగాత మత్ప్ర
తాపభీకరశౌర్యాగ్ని దశదిశలను
బ్రజ్వరిల్లంగ వేగమే భండనమున॥

తురుష్క—అయ్యా! ఏల యీప్రల్లదంబులు! తురుష్కనాథుం డమితకోపస్వభావుండై వచ్చిన వారింప మీరసమర్థులు. నా మాట లాలించి యాతనితో సంధియొనరించుకొనుఁడు.

భీమ— తురుష్కనాథుండు రానీ! పురహరగరుడగమనసరసీరుహాసనసురవరామర ప్రభువు లందఱు దురమున కరుదేరనీ!

ఉ॥ దారుణఖడ్గరత్నముల దాల్చి రయంబున మేన నెత్తురుల్
పాఱుచు నున్నమట్టునకు భండనభూమిని బోరునార లే
తీరున భీతచిత్తులయి తేజమువీడి నిరాశబూని చి
త్తూరుపురంబునన్ రిపుల దూరగ నిత్తురొ రాజపుత్రికుల్.

నీవు మీపాదుషాతో నిద్దియే చెప్పుము.

తురక—చిత్రము. (నిష్క్రమము)

భీమ— పతంగవరకులవీరులారా! మీమీవిక్రమములఁ జూపఁబోవు సమయం బాసన్నం బయినది.

సీ॥ ఎన్నినోఁపున్నెంబు లేర్పడఁజేసి యే
పుణ్యసీమను మీరుబుట్టినారొ?
నేత్రోత్సవ మొనర్చు గోత్రమహారణ్య
పుణ్యనదులకు నెద్ది పుట్టినిల్లు?
సకలకళాధాము లకలంకముగఁ గాంచ
నేభూమినోము ఫలించె మించి?
యెల్లసస్యంబులఁ గొల్లలుగా నిడి
యేమాతమిమ్ము బోషించుచుండె?
తే॥ గీ॥ అట్టి రసపుత్రభూమి హితార్థ మాజిఁ
గఱకుతురకలతోఁ బోరి త్వరితగతిని
బాఱఁద్రోలియు స్వాతంత్ర్యపరులగుటకు
సాయశక్తులఁ గడగుఁడీ శౌర్యమొప్ప॥

మఱియు

కం॥ చిత్తూరు రాజ్యలక్ష్మిని
జిత్తమునం దిడియు దురముఁ జేయుడుమీరల్

బిత్తరి పాఱకుడి మదో
న్మత్తులఁ దురకాధములను మార్కొను వేళన్.

గోరా—

ఉ॥ ఆరయ దోయజాప్తకుల మందుదయించియు నెల్లవిద్యలన్
నేరిచి సుప్రతాపగుణసీరఘులంచును బేరునొంది చి
త్తూరురమాహితార్థమయి ధూర్తులమై తలలూడిపోయినన్
బోరుదు మయ్య మొండెములఁ బూని రణంబున భూధవేంద్రమా॥

బాదూల్— రాజేంద్రా!

ఉ॥ వచ్చిన యుద్ధమందు బడిచచ్చుట యొండెను లేక మ్లేచ్ఛులన్
వ్రచ్చఁ గడంగి సత్వరమె పాఱఁగ దోలుట నొండెగాని వె
న్నిచ్చియుఁ బాఱువారమె! మహేశుఁడు ధీరత శూలపాణియై
వచ్చిన, దేశరక్షణకు పౌరుషకీర్తులు రిత్తబుత్తుమే?॥

భీమ— గోరాసింగ్జీ! నీవు సర్వసైన్యంబులను యుద్ధంబునకు సిద్ధము జేయుము. సభికులారా! కాల మతిక్రమించినది. ఇకఁ గొల్వు ముగింతుము.





# రసపుత్రకదనము.



## తృతీయాంకము.

—* ప్రథమరంగము. చిత్తూరుకోట ముట్టడి *—

(ప్రవేశము) కోటపైని రసపుత్రవీరులు-క్రింద తురుష్కసేనలు:—

(ప్రవేశము) రహిమానుఖాను, అల్లాయుద్దీనుఁడు:—

రహి—మహాప్రభూ ! రసపుత్రవీరుల జయించి దుర్గమును వశపఱచుకొనుట దుష్కరము. రాజపుత్రయోధులచేఁ బ్రయోగింపఁబడిన ఱాతిగుండ్లవలనను, బాణముల వలనను, సలసలకాఁగుచున్న నూనెవలనను మనసైన్యము మూఁడుపాళ్ళు సమసినది. ఇంకొక్కపాలు మిగిలియున్నది. సైన్యములన్నియుఁ గూడి యారునెలలనుంచి ప్రయత్నించినను కోటను బట్టుకొననసమర్థలయినవి. ఇప్పుడు కొద్దిసైన్యముతోఁ గోటను బట్టుటకల్ల. కావున మఱలి మనఢిల్లీకిఁ బోవుట యుక్తము.

అల్లా—అరెరే! ముట్టడిమాని పోవుదమా? ఎంతమాట లాడితివి? వ్యర్థముగా వచ్చినదారిని మఱలి పోయిన బాగుండదు కావున నీవా రసపుత్రులపాలి కరిగి పద్మినీదేవిని జక్రవర్తికి నర్పించిన కోటముట్టడి మానిపోవుదనని చెప్పుము.

రహి—వా రందుల కంగీకరించకున్న

అల్లా—పోనీ యామె నొక్కసారి చూపించినను సరే. ముట్టడి మాని పోవు దనని చెప్పుము.

రహి.—అందులకు సంగీకరించవలెనో

అల్లా.—దాని కయిష్టపడిరేని కోటను బాడానర్చి వారి స్వాతంత్ర్యతఁ జేకొనుడనిఁ జెప్పుము.

(రహిమాన్, అల్లాయుద్దీన్, తురుష్కసైన్యము నిష్క్రమణము.)

(ప్రవేశము) భీమసింగు, గోరాసింగు, బాదూల్‌సింగు, ప్రతాపసింగు, దుర్గసింగు, జయసింగు, సమరసింహుఁడు, అజేయసింగు, సాగరసింగు.

భీమ.—గోరాసింగ్జీ! తురుష్కసైన్యములు కోటముట్టడి మానుటకుఁ గతంబేమి?

గోరా.—మహారాజా! కారణం బేమియుండును. మనధాటికి నోర్వఁజాలకయే.

(ప్రవేశము సేవకుండు.)

మహారాజా! యెవరో తురకవాఁడు మీకు సందేశంబుఁ దెచ్చినాఁడు.

భీమ.—ఏమీ! తురుష్కుండు సందేశముఁ దెచ్చినాఁడా! సత్వరముగానిఁ దోడ్కొనిరమ్ము.

(సేవకుఁడు నిష్క్రమణము)

(ప్రవేశము) రహిమానుఖాను భీమసింగునకు సలాము మొనరించి

రహి.—భీమసింగు మహారాజా! అల్లాయుద్దీను చక్రవర్తిగారు మీకు రాయభారముఁ బంపినారు.

భీమ.—ఏమీ! చక్రవర్తి రాయభారంబుఁ బంపెనుగా!

గోరా.—అపు నాతని కండన జొట్టును, నందకుండెన గాళ్ళనుగదా.

ప్రతా.—ఇంతటి పౌరుషవంతుఁడైన యాతండు దుర్గంబును ముట్టడింపనేల?

దుర్గ — ముట్టడింపకేమి! యాతనికి మనోగర్వాంధకారము కన్నుల కెగదట్టినది గదా.

బాదూల్ — ఆకుటిలుండు సరియైనరాయభారము: బంపునని నాకుఁ దోఁచదు.

జయ — ఆ మూర్ఖునిచర్య యిట్టిదే కాఁబోలు. మిన్నుమన్నెఱుంగక క్రొన్నన శత్రుపురంబులపై వచ్చుటయు వారిని జయింప నశక్తుండైన రాయభారంబులఁ బంపుటయు.

సమర — సంగరకాలమధ్యంబున రాయభారులఁ బంపుట శూరజన లక్షణంబని యాతం డెంచియుండును.

అజేయ — కాకున్నఁ దురుష్కులేల! రసపుత్రుల జయించు టెట్లు!

సాగర — పాపమాబుద్ధిహీనుండు దురాశ దుఃఖదాయకంబను యెఱుంగ లేదు కాఁబోలు.

భీమ — రసపుత్రవీరులారా! యేల మీ వృధాభాషణములు. రాయభారం బేమని పంపెనో తెలుసుకొందము. (రహిమాను వంక తిరిగి) మీచక్రవర్తి రాయభారం బేమని పంపెను?

రహి — మహారాజా! తనకు మీపయి నేమియు ద్వేషములే దనియుఁ బద్మినీదేవిని దన కర్పించినఁ గోటముట్టడి మాని పోవువాఁడ ననియు

భీమ — (క్రోధముతో)

శా॥ ఓరీ! మ్లేచ్ఛకులాబ్ధిబాడబమ! గర్వోన్మత్త సంప్రాప్త! దు
ర్వారోగ్రప్రకటప్రతాపవిభు భార్యారత్నముం గోరెఁగా?।
మీరాజాధమచక్రవర్తి పురలక్ష్మిం బట్టనుంకించియున్
ధీరాత్ముం డయి రాజపుత్రుల శరాగ్నిం దప్పుఁడా టొప్పనే?॥

గోరా—ఉ॥ కారులుగూయసాగితివిగా? తుకారాధమ! దుర్మదాంధుఁడ
వీరపతివ్రతామణిని వెంబడి చేకొని పోవ నెంచనే?
ధీరత నిట్టి వార్తలను దెచ్చితె? వానికిఁగాదు, నీకు నేఁ
గోరి యొసంగుచుంటి నిదె కొన్ని ముదంబున మృత్యుకన్యకన్॥

జయ—ఓరీ కలుషభాషణా! నీనాలుకను వేయిచీలికలుగా నఱికినను బాపంబులేదు సుమా.

ప్రతా—కం॥ ఏలా దుర్మతి! వచ్చితి
వీలాటి కఠోరవార్త లిమ్మెయిఁ జెప్పన్?
జాలు నిఁక నిన్ను మత్కర
వాలంబున భూవనితకు బలినిత్తు వెసన్॥

సమర—రాజా! సంశయంబేల? ఈదుర్మార్గుని గతప్రాణునిఁ జేసెదను.

దుర్గ—కం॥ భయమొక్కింతయు లేకయె
రయమున నీవార్త నిటుల రాఁ దెచ్చితె! ని
న్ను యమునిఁ జేర్తు నిపుడు సం
దియ మిఁకఁ బడబోకు దుర్మతీ మూఢాత్మా॥

అజేయసింగ్—ఇంకను వీని ప్రాణములతో నుంచితిరా?

బాదూల్—

శా॥ హిందూరాజ్యరమాలలామసుతులన్, హేయంబుగా దాస్యమం
దుం దృప్తింబడ ద్రోసి దుష్కృతములన్ ఘూర్ణింపునై చేయు నా
నిందార్హుంపు తురుష్కనాథుకడ దుర్నీతుండవై చేరి యీ
సందేశంబును దెచ్చినాఁడవుర? నీచా! కాలునిం జేర్తునిన్॥

సాగర—ఒకవేళ నారాజ్యాంధకారుం డిట్టి కుటిలసందేశంబుఁ బంపినందుల కేమి గాని, తగుదునని ధైర్యంబునఁ దెచ్చిన నీతల వేయి వ్రక్కలఁ జేయకుండుట యిత్తఱిదోషంబని నిశ్చయంబైనది.

భీమ.— ఉ॥ దుర్గము బట్టనెంచెఁగద దోర్బలశాలునిభంగి బొంగి స
న్మార్గధురీణులైన మము మార్గము గాని దుర్గముఁ బట్టలేఁడె? దు
ర్మార్గుఁడు, చక్రవర్తి; పలుమాటలిఁ కేలనుపొమ్ముపొమ్ము నిన్
దుర్గతి పాలొనర్చెదను దోసముగల్గును దూతవాటచే॥

శూరాగ్రేసరులారా! మనమితని దూషించవలసిన దేమియున్నది ఈతండు తనసేవకాధర్మం బనుసరించినాఁడు. (రహిమానువంక దిరిగి) రాయభారము సవిస్తరముగాఁ జెప్పుము.

రహి.— మహారాజా! అందులకు మీరంగీకరింపనిచో మీదుర్గంబును భగ్నం బొనరించువాఁడనని చెప్పుమనెను.

భీమ.— నీవు మీచక్రవర్తి యొద్దకు వెడలి పోయి, యివ్విధంబునఁ జెప్పుము.

సీ॥ ఆజన్మమరణంబు నాహవకేళియే
యన్నపానములు మా కగునటనుము
దుష్టులశిక్షించి శిష్టులగాచుటే
సితకంకణము ముంజేతి కనుము
మానాభిమానముల్ మాతాపితలుపౌరు
షము ధైర్యమును సహజంబులనుము
నిత్యసత్యముమాకు నియమంబుధర్మమే
మార్గంబు క్రూర దుర్మార్గ యనుము

తే॥ గీ॥ మానవంతుఁడైన యెడల మాటలుడిగి
కత్తి బట్టియు మాతోడఁ గదనమందుఁ
బోరి యశమును గాంచు మోమూర్ఖచిత్త
మ్లేచ్ఛకులపాంసనాధమ! తుచ్ఛ! యనుము॥

రహి.— మహారాజా! యింకొక సంగతి కద్దు. అట్లుగాక మీరాప్పె
న్నాతనికిఁ జూపించినను సరే యతఁడు కోటముట్టడి మానుపో

వును, అందులకు నంగీకరింపకేని మీకోటను నిర్మూలించుట నిశ్చయము.

భీమ— రసపుత్రశూరులారా! యిందులకు మీ కేమనియెదరు?

గోరా— ఇందుల కామె యనుకూలించిననే

జయ— ఆమె యిందుల కంగీకరించుటకల్ల

ప్రతా— ఆపతివ్రతాశిరోమణి తనపవిత్రగాత్రమును తురుష్కధాత్రీధవునికిఁ జూపు ననుమాట యసత్యము.

సమర— ఆమె యీకృత్యంబున కాయత్తపడునని కలలోనైనఁ దలంపవలదు.

దుర్గ— ఆపవిత్రచరిత్రి యేడ! యీముష్కరాధముకేఁ దనదివ్యసుందరాకారంబుఁ జూపించు టేడ!

అజేయ— ఆమె ప్రాణత్యాగంబునకైన నంగీకరించునుగాని యిట్టి నీచకృత్యంబున కొడంబడదు.

బాదూల్— పద్మినీదేవి యిందుల కిష్టపడుననియా మీయభిప్రాయము.

సాగర— తురుష్కులనామంబైన వినవొల్లని యాపతివ్రతాశిరోమణి యిట్టికార్యంబున కనుకూలించుటకల్ల.

భీమ— ( ఆలోచించి ) రహిమానుఖానుతో

నీవుపోయి రేపుదయంబునఁ జక్రవర్తి నొంటరిగా రమ్మనుము.

(రహిమాన్ నిష్క్రమము.)

బాదూల్ — రాజా; ఏల తొందర పడితిరి? పద్మినీదేవి యిందులకంగీకరించుననియా యెంచితిరి,

భీమ.— ఇందులకాపె యంగీకరింపకున్న నద్దంబున నాపె ప్రతిబింబ మును జూపింపవచ్చునుగదా.

గోరా— అవు నట్లే కనుపఱుపవచ్చును.

---

## ద్వితీయరంగము.

### పద్మినీదేవి యంతఃపురము.

(ప్రవేశము పద్మినీదేవి.)

పద్మి—

ఉ॥ భండనభూమియం దుభయపౌరుషముల్ కనుపింప సేనలు
దండతఁబోరుచుండె బరతంత్ర మనంగ నెఱుంగ నట్టియా
మండిత కాంతిభూతులగు మా రసపుత్రచమూవరాళి కా
యండజవాహనుండొసగు నంతసుఖంబు జయంబు నిమ్ముగన్ ॥

ఆహా! ఈహిందూస్థానము తురుష్కవ్రాతం బచట వలనఁ గల్గినదురవస్థ యింతయంతని వేనోళ్ల నున్న శేషునికైన నెన్న శక్యమే?

సీ॥ అన్యకన్యకలఁ బెండ్లాడుటకతననే
బాల్యవివాహముల్ ప్రబలమయ్యెఁ
బరకామినులబట్టి చెఱబెట్టుకతననే
స్త్రీలకు ఘోషా విధింపఁబడియె;
కళ్యంబులెల్లను గాల్చుట కతన మ
హాకావ్యతతు లెన్నొ యడఁగిపోయె;
భరతపుత్రులు కులభ్రష్టులౌ కతననే
తురకల జనసంఖ్య పెరుగఁదొడగె;
తే॥ గీ॥ తొలఁమదేవత చాల రేఁగు కతన జనులు
తిండికై దాస్యనిరతి దిగుచు నుండ్రి;

కలన తురకలఁ గొల్చుట కతన దేశ
భాష నశియించె నెల్లరు వ్యర్థులైరి ॥

తే॥ గీ॥ అకట! పురుషులు పారతంత్ర్యాభిలాషు
లగుటచే స్త్రీల స్వాతంత్ర్య మడుగుసంటె
స్త్రీలస్వాతంత్ర్య మడగుట చేతవారి
కెల్ల నుత్తమవిద్య నశింపవలసె ॥

(ప్రవేశము) భీమసింగు, చింతాక్రాంతుండై

పద్మిని— నాథా ! (లేచి)

చ॥ దినదిన ముండుసట్టి ముఖ తేజము నేడుఁగనంగరాదు కా
రణ మరయంగ లేను రణరంగమునం గలవార్తలన్నియున్
మనమునఁ దల్చి యిట్లు లసమానవిచారపయోధి మున్గి రో
యని రసపుత్రశూరులు జయంబున మ్లేచ్ఛుల నోడఁజేసిరా!

భీమ— కాంతామణీ!

తే॥ గీ॥ జయము నందంగలే దపజయము నంద
లేదు మాసము లారుగా మ్లేచ్ఛకోట్లు
దుర్గమునుబట్ట యత్నించె తుదకు రాయ
భార మంపెను వశి చక్రవర్తిమాకు ॥

పద్మి— మనోహరా! మీరా రాయభారంబును కంగీకరించితిరా!

భీమ— (ఆత్మగతము) దైవమా! చిక్కనబెట్టితివే! ఈపెకురా
యభారం బంగీకరింప లేదనిన మరల యుద్ధంబు జరుగునని
మిన్నకుండును అంగీకరించితిమని చెప్పిన రాయభారం బెద్దియో
యడుగును. రాయభారంబుఁదెలియఁజేసిన నేమి యసందర్భ
ము వచ్చునో (ఆలోచించి) ఎట్లును జెప్పక తప్పదు. (ప్రకా

శముగా) ప్రేయసీ! రాయభార మంగీకరించితిమి (అని తలవం
చుకొనును.)

పద్మి— ప్రాణనాయకా! మీరిట్లు చింతాక్రాంతులైతిరి ? రాయ
భారంబు విధిలేక యంగీకరింపవలసివచ్చినదా ?

భీమ— విధికర్తృంబుగానైన నేమి, నాయంగీకరించిన నేమి, సందేశంబును
స్వీకరించితిమి.

పద్మి— నాథా! అ యన నది యెట్లింగీకరించిరో ?

భీమ.—

ఉ॥ అంబురుహాయతాక్షి! విను, మా తురకాధిపు డంపె రాయభా
రంబు నదెట్టులన్న నిను గ్రన్నన నాతని కిత్తుమేని దు
ర్గంబును వీడిపోవు నికఁ గాదని యిన్నను నంగ్రహించు దు
ర్గంబును బాడొనర్చి వడిగా రసపుత్రుల గెల్చువాఁడనిన్॥

ప్రథమంబు నాతండిట్లుఁ బంపరసపుత్రులెల్లరు కోపోద్రేకులై
యట్టి సందేశముఁ దెచ్చినవానిని వధింప యత్నింప నేను
వారించితిని. అంత నాతం డింకొకవిధంబునఁ దెల్పెను.

పద్మి—ఔరా! యీతురుష్కపు రక్కసుడెంతఁ దలపెట్టెను. తొల్లి
రావణుండు సీతను దొంగిలిపోయెనని యీతండు నన్ను దొర
తనంబున గొంపోవ నెంచెనుగాని పరకాంతాపహరణంబున
రావణుండు ప్రాణంబుల. గోలుపోయెనని దలంచలేదు కాబోలు
నాథా ! రెండవ తెఱం గెద్ది ?

భీమ— కాంతామణీ! భవదీయజగన్మోహనాకారం బొక్కసారి
చూపి నేత్రోత్సవం బొనరించిన నాతఁడు ముట్టడి మానిపోవు
నని. ఇందులకు మే మనుకూలించితిమి

పద్మి— ప్రాణనాథా! కాంతలకు స్వాతంత్ర్యము లేకపోవుటచేఁగదా నా కీకాంగికకు మీరాసంగతులు కనుఁగొంచి నాకవమానంబు సంఘటిల్లఁ జేయఁ దలంచితిరి.

భీమ— సాధ్వీమణీ! ఆజ్ఞయిచ్చుటకు వల పనుము. నీదివ్యమోహనా కారం బన్యులకు గనుపడుటయు నాకుమాత్ర మవమానకరము కాదా? (కోపమున)

తే॥ గీ॥ తాత ముత్తాతలాదిగాఁ దనరు ధనము
లెన్ని యున్నంట నుండియో యున్నయట్టి
మన స్వతంత్రత విడనాడి మనఁగవలసె
వచ్చునో మాని చింతిలి వల్లె యంటి॥

పద్మి— నాథా!

తే॥ గీ॥ కలలయందైనఁ బరునిఁ నేఁగాంచి యెఱుఁగ
నద్ద మందైనఁ బరులు నన్నరయలేరు
కాన నేనొక్క మ్లేచ్ఛుని కంటఁబడుట
కల్ల నను వాఁడు చూచుట కల్ల కల్ల॥

స్వాతంత్ర్యాభిమానంబునకై యగ్నినుదకమున్నను నురికెదను గాని నేనొకనికంటఁబడి యాతని మనంబున దుర్బుద్ధి సంకురింపఁ జేయనొల్లను.

భీమ— ప్రేయసీ! నీవాతని కంటఁబడి యవమానంబు నొందకున్న బోనిగాని యద్దమందు నీ ప్రతిబింబ మతనికిఁ జూపెదవా?

పద్మి— ప్రాణేశ్వరా! ఆతఁడు కేవలము నన్నుఁ జూచిన నొకటియు లేక నాప్రతిబింబంబును జూచిన నొకటియునా?

భీమ— తరుణీమణీ! నీ పిందములకుఁ బ్రతికూలింప దగదు. అట్లుఁ బ్రతి కూలించిన స్వాతంత్ర్యముకొఱకు మరలఁ బోరాటము నివ్వ

టేల్లును. ఏల వృథాజనవినాశనమును, ధనవ్యయమును సహరించుకొనవలయు?

పద్మి—నాథా! భర్త్రయానుజ్ఞ మీమాట పాతివ్రత్యలక్షణంబుగాదు. కావుననందులకు నే సంగీకరించితిని. నా కలంకము బొంటగట్టకుండ నాప్రతిబింబం బతనికిఁ గనుపఱుపుఁడు.

భీమ—రేపు సూర్యోదయంబుననే భవత్ప్రతిబింబ సందర్శనార్థంబు చక్రవర్తి రాఁగలఁడు.

నీవిట కరుదెమ్ము. చాలకాల మైనది. నేఁ బోయెదను. (నిష్క్రమణము)

---

## తృతీయరంగము.

### రాజపుత్రుల సభ.

(ప్రవేశము)- భీమసింగు, గోరాసింగు, జయ, ప్రతాపసింగ్, సమర, దుర్గ, అజిత, బాదాల్‌సింగు, సాగర, కాంచ్సింహాది యుందురు.

(ప్రవేశము-భయకంపితుఁడై యల్లాయుద్దీనుఁడు.)

భీమ—చక్రవర్తిగారు! విచ్చేసితిరా? అదిగో పద్మినీదేవిని జూడుఁడు.

అల్లా—(భయముతోఁ దడఁబడుచు బాగుగఁజూచి) భీమసింగ్ మహారాజా మీరు నాకొసఁగిన మర్యాదలకుఁ జాల సంతోషించినాను. మీధర్మగుణమును నెన్న నేనెట్లశక్యము? కాకున్న నొంటిగావచ్చిన శత్రురాజునకు నెంతయో మర్యాద నెవరు చేయుదురు?

(సింగులు చక్రవర్తిని గత్తులతోఁ గొట్ట యత్నింతురు)

భీమ—చక్రవర్తిగారు! నేను మీచేతఁ బొగడఁబడునంతవాఁడనా? (సింగులవైపుజూచి) రసపుత్రులధర్మము నొడిగట్టుకొందురా?

చక్రి—ఇఁక ముందు మీరును నేనును స్నేహభావంబున నుందుము.

భీమ—మంచిది. మీయిష్టానుసారముగ నట్లేయుందము. (సింగులవై పుజూచి) అధర్మప్రవర్తనము మానుఁడు.

చక్రి—అవును. ఇదివరకు మీయెడ నధర్మముగానే ప్రవర్తించితిని. క్షమింపఁ వేఁడెదను.

భీమ—ఇంసులకు క్షమింపనేల? మీరలిఁక యధర్మంబునుమానుఁడు.

(అనుచు చక్రివర్తియు భీమసింగును ముందుకుఁబోదురు.)

(తెరవాలును)

(అంతలో యల్లాయుద్దీనుయొక్క సైనికు లాకస్మికంబుగ వచ్చి భీమసింగును బట్టుకొందురు.)

భీమ—(రోషభయాశ్చర్యంబులతో)

శా॥ ఔరా! క్షుద్రకులేంద్రమా! సమదగర్వాంధా! తురుష్కాధమా
మా రాజన్యులు నిన్ను జంపుటకునై మారొక్కన్నఁగాపాడితిన్
గ్రూరా! తత్ఫలమందితి న్వడి నహా! క్రొంపోవ నుంకించితే
ఛీ! రమ్మా నిను కాలుసన్నిధికి నక్షీణోగ్రతన్ బంపెదన్॥

అల్లా—ఓరీ రాజపుత్రాధమా! నిన్ను డిల్లీకి ఖైదీగాఁ బట్టుకొనిపోవుచుంటిమి. పద్మిని నొసంగితివేని నిన్నువిడిచెదము.

భీమ—(క్రోధముతో)

ఉ॥ ఓరిమహోగ్రకల్మషు.డ! యోరి పరాక్రమహీన! క్రూర! యీ
ధారుణి సూర్యవంశజులు ధర్మముఁదప్పరు రంచు నెంచి యీ
తీరున మీ దెఱుంగకయె తెంపునఁ గారులు కూయసాగితే?
వారక నిన్నసిం జదిపి భారముదీర్చెద భూమిదేవికిన్.

అల్లా—చాలు, చాలు, అట్లు పద్మినినో సంగవు గా! నిన్ను డిల్లీకిఁ గొంపోవు చుంటిమి. (అని చేతులుగట్టి దీసికొనిపోదురు.)

---

## చతుర్థరంగము.

### భీమసింగుని చెఱసాల.

(ప్రవేశము) భీమసింగు. (విచారముతో)

సీ॥ సింహంబు నైనను సింహనాద మొనర్చి
సంహరించెదు భీమ సింహబలుఁడ
మదకరీంద్రము నైన నెదిరించి విదలించి
తుదముట్టఁ జేసెడు దోర్బలుండ
ఖడ్గి నైనను వాడి ఖడ్గంబునను గడి
కండలోనర్చెడు ఖడ్గధరుఁడ
బెబ్బులి నైనను నిబ్బరంబునఁ బట్టి
తబ్బిబ్బుఁ జేయు ఘూర్ణాకృతుండఁ

తే॥ గీ॥ గాలవశముననో కాక కర్మవశము
చేతనో చెఱసాలలోఁ జేర్పఁబడితి
వంచన మొనర్చు నా మ్లేచ్ఛ పంచకముల
పంచఁ బంజాననంబు లైనడిః దలంప.

నళినీకళత్రపవిత్రకులదుగ్ధవార్ధిచంద్రా! రామచంద్రా! సద్గుణ సాంద్రా! భవదంశసంభూతుండ నగు నన్నీ కారాగృహ విముక్తునిఁ జేయ భరమా? హా! చిత్తూరుపురవరేణ్యమా! సకల కళాపరిపూర్ణుం డగు హిమాంశుండు తన చంద్రికలఁ బ్రచురింప రజితపుసిరుచే మెఱుంగిడఁ బడినట్లుఁ గన్పట్టు నీ కలధౌతమయ సౌధంబుల, గన్నులారఁ గని ముదంబందు స ద్భాగ్యంబు నా కింతటితో సరియేనా? దిగంతవిశ్రాంతకీర్తి

వంతులగు భవత్ప్రియ తనూజులను నిశాంత సంతోషస్వాంతుండనై పరిపాలించు దశ నేటితో సరియేనా? పుట్టువుందొట్టి భవదశేషకరుణా దత్తసర్వ సస్య ఫలంబుల ననుభవింపుచు మాతృరక్షణ పరాయణ బిరుదాంకితుఁ డనగుట యీదినంబుతో సరియేగదా? నేత్రోత్సవదాయకంబులగు నీశాఖోపశాఖలు సుమపల్లవఫలకలితంబు లగు నానావిధ మహీజ సందోహావృతోద్యానవనంబులందు విహరింపుచు నిరంతరముఁ గుతూహలుండనగుట యిక ముందు నేను నోచుకొనలేదుగదా? హా! నిన్ను గని ముదంబును నేత్రయుగ్మంబు దుర్మార్గుండైన చక్రవర్తి తీయనుండెను సుమా! నవరత్నస్థాపితంబగు కోటీరంబు ధరియించు నీశిరము నేఁడా ముష్కరతల వరుల కరవాలంబులకు గురియగునా?

హా! పద్మినీ! నీ సుందర మందస్మితంబగు నీముఖారవింద మరందంబు గోరుట కికఁ నే నోచుకొనలేదు సుమా! భవద్వియోగానల సంతప్త మానసుండనై నే నీనిబిడాంధకార బంధురంబగు చెఱసాలలో వసటనొందు దుర్వార్తనాకర్ణించి యెంతసంతాపపడుచుంటివో గదా! హా! పతివ్రతామణీ!

పద్మినీ! ప్రియవచనానందసంధాయకంబగు నీమృదుమధుర భాషణంబులచే సమానందిత హృదయారవిందుం డనగు భాగ్యంబీనాటితో సరియేగదా? ఏముష్కరుండు నీదివ్య సుందర విగ్రహ ప్రతిబింబ సందర్శనోద్భవ కామోన్మాద పిశాచ గ్రస్తుండయ్యెనో యాదుర్గుణాంధునిచే నీప్రియభర్త మృత్యుదేవతా వశీకృతుండుగాఁ జేయఁ బడినఁ దత్పతి వియోగ దుఃఖవార్ధిఁ దరియించుటకు నీకొండు సాధనంబు లేదుగదా! ఛీ! యేమి బేలనై వడి నాపోవుచుంటిని! ఓరీ! పాదుషా! పాదుషా! విశ్వాసఘాతుకా! భ్రష్టాగ్రేసరచక్రవర్తీ! నిపురా!

యీఘోర సంగరారణ్య సంచార పంచాననంబగు నీ భీమసింగును వధించునది ? ఇదిగో, యమపాశతుల్యంబగు మద్బాహుపాశంబులచే నిన్ను విగతజీవునిఁజేసెదను. వృథాపౌరుషమా ! యేల నాయందు నిల్చెదవు ? క్రోధమా ! నీకు వేఱొండుస్థానంబు గన్పడలేదా ? ఆశాపిశాచమా ! నీదారిని నీవు పొమ్ము. ఇంక నెక్కడి చిత్తూరు రాజ్యము! స్వాతంత్ర్య లక్ష్మి! యిక నీకుఁదగువారి ననుసరించుము. హా! పద్మినీ! హృత్పద్మినీ ! నీ వేసామాన్య పురుషునినైనఁ గరగ్రహణం బొనరించుకొనిన యెడల నిట్టిదుస్థితి నొందకుందువుగదా ! నీసుందరప్రతిబింబమును బరునకుఁ జూపిన యిందుఖలునకిట్టి యవస్థ రాకుండును గదా? ఛీ! విచారమా! మగవారల నేల నాయంజేరితివి. ఐహిక సౌఖ్యాభిలాషమురా ! యిక నీ నశ్వరాలనగుము. స్వర్గమా! నీవు కరతలామలకమగుచున్నావుగదా. (ప్రవేశము) అల్లాయుద్దీనుఁడు) ఆహా ? మజలల నదిగో యీపాతకి వచ్చుచున్నాఁడు. ఔరా! యీతఁడెట్టిదుర్భాషలాడునోగదా ? పంచ మహాపాతకయుక్తంబగు నాతని . ముఖంబును జూడఁగూడదు. నేత్రములారా ! యిక మీదృష్టిని విసర్జింపుఁడు. శ్రవణకుహరములారా ! యిక మీశక్తిని విడువుఁడు.

(ప్రవేశము:— అల్లాయుద్దీనుఁడు, రహిమాన్‌ఖాన్)

అల్లా.— ఓరీ! కాఫర్ రాజపుత్రా ! నీవుఁ బ్రాణములపై నాశగలదేని పద్మినిని మాకర్పించుము.

భీమ.— ఓరీ! కామాంధీభూతచేతస్కుఁడా! యింతవరకు నీవు మానాభిమానములుగల వీరపురుషుండ వనుకొంటిమి గాని యిట్లు దుష్కార్యధౌరేయుండవని యెన్నండును దలఁపలేదు. రజపుత్రులకు మానాభిమానము లేతలిదండ్రులని యెఱుంగుము,

మః పరభార్యాముఃశి నిష్కళంక యనుచుఁ భావంబునం బెంచవో
పరువా యిట్టులఁ గోరఁజూచితివి యోపాపాత్మ! చండాల! నీ
శిరముం ద్రుంపక సాగనంపితిమిరా చింతింపలేవేల? న
త్తగు శీలవతిం జూడవచ్చినపుడే సంభ్రమతా! ముష్కరా!
చేత ఖడ్గంబుం బూని శౌర్యవంతుండవై తివేని మాతోఁడి ధర్మ
యుద్ధం బొనరించి జయంబు నొందుము.

"నిన్నుఁ జంపెద" నని నంత మాత్రమున నీతుచ్ఛప్రాణంబుల
నాశపడి వీరపతివ్రతామఃశియగు పద్మిని నర్పించి సూర్యకులంబునకుఁ
గళంకంబు దెత్తునని కలలోనైన దలంపవలదు.

అల్లా— అట్లనా మంచిది (రహిమానుఖానుతో) రహీం! వెళ్లిగాఁ
గాల్చిన యినుపకడ్డీలచే నీతని కన్నులను బొడిచి వేయుము.

(రహిమాను కాల్చిన యినుపకడ్డీలను దెచ్చి భీమసింగుకండ్లు పొడుచు
టకు సిద్ధుడై యుండఁగా సేవకుఁడు ప్రవేశించి)

సేవ— మహాప్రభూ! ఎవరో రాజపుత్రుండు మీకు సందేశము
దెచ్చినాఁడు.

అల్లా— రాజపుత్రుడు సందేశము దెచ్చెనుగా? రహిమాన్! రాజ
పుత్రుండెవరో రాయభారము దెచ్చినాఁడు. వధ నాపుము.

(రహిమాన్ అట్లుచేయును.)

(ప్రవేశము) దుర్గసింగు.

అల్లా—రాజపుత్రా! ఆకుర్చీపై కూర్చుండుము. (దుర్గసింగు కూర్చుం
డును.)

దుర్గ— చక్రవర్తిగారూ! మహారాణిగారు మీకు రాయభారంబుఁ బంపిరి.

అల్లా— ఏమని పంపిరి ?

దుర్గ— "భీమసింగు మహారాజుగారిని విడిచెదరేని భర్తసంరక్షణార్థము పద్మినీదేవిగారుమిమ్ము వివాహమాడ నిశ్చయించుకొనిన దని

అల్లా— వహ్వా! నన్నుఁ బద్మినీదేవి పెండ్లి యాడునుగా? శబాస్ మంచిది. ఇంకేమని పంపిరి.

దుర్గ— అందులకు మీ రనుకూలించి రేని—

అల్లా— అనుకూలించ కేమి? నే పశుపాట్లన్నియు నాపెకొరకే గదా?

దుర్గ— అమెను సాగనంపుటకు రాజపుత్రస్త్రీలందఱు పల్లకీలలో నెక్కి వత్తురు. వా రేడువందలకన్న నెక్కుడుగా వత్తురు.

అల్లా— (తనలో) ఏడు వందలమంది వచ్చెదరుగా! వీరికందఱకు దగు పరిభవం బొనరింపవలయును. (ప్రకాశము) అయిన

దుర్గ— వారు ఘోషాస్త్రీలుగాన మీ సైనికులలో నెవ్వండును వారికి గనుపించఁగూడదు. వారందఱికిఁ బ్రత్యేకముగా డేరాలను వేయించవలయును.

అల్లా— మంచిది. తరువాత!

దుర్గ— పద్మినీదేవిగారు తనభర్త నొక్కసారి కలసికొని మాట్లాడి తదుపరి మీయధీన యగును. ఇందులకు మీ రంగీకరించవలయు. ఇదియే సందేశము;

అల్లా— సరే మంచిది. పద్మినీదేవిని సాధ్యమైనంత త్వరలోఁ దీసి కొనిరండు.

దుర్గ— అల్లానే శీఘ్రకాలములోనే తీసికొని వత్తురు. ఇక నేను సెలవు పుచ్చుకొనియెద. (నిష్క్రమణము)

అల్లా— రహిమాన్! చూచితివా! రాజపుత్రులు మనధాటికి వెరచిరి పాపము వారలు మొదటనే పద్మిని నిచ్చిన నింతయవస్థఁ జెంద కుందురు గదా! నేఁడు నాకు పద్మిని పొందు లభించునుగదా? నే నింక నలంకరించుకొనుటకుఁ బోయెదను. నీవును రమ్ము.

(అని యిద్దరు నిష్క్రమింతురు)

(తెఱలో పల్లకీమోఁత) (ఒక పల్లకి భీమసింగునకడకు వచ్చును)

పల్లకీమోయువాఁడు.—

భీమసింగుమహారాజుగారూ! పద్మినీదేవిగారు అల్లాయుద్దీనుని పెండ్లాడియైనను మిమ్ము రక్షించుటకు నిశ్చితురాలైనది. మిమ్ము నొక్కసారి చూచిపోవచ్చినది.

భీమ.— ఆ! ఏమి! పద్మినీ యల్లాయుద్దీనుని బొంద నిశ్చయించినదిగా? ఔరా! స్త్రీలెంతటిసాహసురాండ్రు, ఛీ! ఆపరాత్మురాలి మోము నేఁ జూడ నొల్లను.

గోరా— (పద్మినీవేషముతో) మహారాజా! నేను గోరాసింగును మీరీపల్లకీయందుఁ గూర్చుండి పారిపొండు.

భీమ— (గోరాసింగును గౌఁగలించుకొని) గోరాసింగ్జీ!

ఉ॥ వంచనఁ జేసి నన్నుఁ జెఱఁబట్టిన వంచకులైన వారి వం
చించియు నీవు నన్నిటుల శీఘ్రమె మ్లేచ్ఛులబారినుండి ర

క్షించితివయ్యా! యిప్పు డట కేగుము పట్టుము చక్రవర్తిని
బ్రోచుము శత్రుసైన్యముల, దోర్బల సింహ ప్రతాప సింహమా!

(అని భీమసింగు పల్లకియెక్కి పోవును)

(తెరలో) మోసము. మోసము. భీమసింగు పారిపోవుచున్నాఁడు.

గోరా.—ఓరీరి తురుష్కపాంసనులారా! ఎందుబోయెదరు! రండు. సన్నెదుర్కొని పోరాడుడు. (అని తెరలోనికరిగి మెండు గాయములచే నిండిన దేహంబుతో వచ్చి)

ఉ॥ ఎక్కడఁ జూచినన్ దురక లే, కనుపట్టద రంతెగాని నా
కిక్కడ రాజపుత్రుఁ డొకఁ డేనియుఁ గన్పడ డేమి చిత్రమో!

(దేహమును జూచుకొని)

అక్కట! దేహమంత రుధిరావృతమయ్యెను, గాయముల్ కడున్
స్రుక్కఁగఁ జేయుచుండె నిఁక సుంతయుఁ గాలుఁ గదల్పఁజాలనే!

(అని నేలపైఁ గూర్చుండి)

ఉ॥ బాధ భరింతునే? పిపాస బారుచునున్నది నాల్క యిత్తరిన్
సాధనమొండు లేదు రణసాగరముం దరియింప నింక న
య్యో! ధృతిఁ బాసితిన్ మరణయోగము దాపగునో! చిత్తోడ్రమా
నాథునిఁ జూచుభాగ్య మయినన్ లభియింపదొ నాకు దైవమా!॥

హా! కుమారా! బాదూల్ సింగ్జీ! నిన్నింకఁ గాంతునో, కాంచనో. (అని పడుకొని యించుక మూర్ఛాగతుండగును.)

(రహిమాను ప్రవేశము)

రహి.—ఏమీ? ఈ రాజపుత్రయోధుండు మూర్ఛిల్లినట్లున్నవాఁడు. ఇతనిమాటలు గమనింప నీతఁడు బాదూల్సింగునకు దండ్రియై యుండనోపు. ఇదియే సమయము. ఈతనిని వధించెదను. (అని సిద్ధుండగునంతలో)

(తెరలో) బాదూల్‌సింగు—

ఓరోరి తురుష్క సైనికులారా!

చం॥ పరుగిడనేల? భండనము బ్రాహ్మణవీధిగ దోఁచలేదొకో!
కఱకుకఠారధార నరుకంగను గోవులుగారు క్షత్రియుల్
పరరమణీలలామలను బట్టుట కాదిక మమ్ముఁ బట్టుటల్
గరువముజూపి కొల్లగొనగాఁ బురికాదికి మత్ప్రతాపమున్॥

రహి—ఎవరో రాజపుత్ర యోధుండు వచ్చుచున్నాఁడు. ఆలస్యముఁ జేసిన నాప్రాణములు దక్కవు. (అని గోరాసింగును ఖండించి పారిపోవును.)

గోరా—హా! కుమారా బాదూలుసింగ్జీ!

(ప్రవేశము— బాదూలుసింగు)

బాదూలు—ఏమిది! "హా. కుమారా! బాదూలుసింగ్జీ" యనునార్త ధ్వని వినవచ్చినది. ఒకవేళ నాజనకుని కేమియైన ప్రాణాపాయము సంభవించి యుండలేదుగదా? ఆయనకా ప్రాణాపాయంబు సంధిల్లుట!

ఉ॥ భండనభూమియందుఁ గరవాలము బూని యరాతివీరులన్
జెండుచు నిల్వ నప్పురుషసింహుని ఘోరశరాగ్ని కోడఁడే!
యుండెడివాహినుండె యనఁ సద్రిజనాయకుఁడైన నిమ్మహీ
ఖండమునందు మజ్జనకు గర్వ మడంపఁగఁ జాల రెవ్వరున్॥

గోరాసింగును జూచి (ఆయనపైఁబడి)

కం॥ జననీజనకులు బాల్యం
బుననే మృతినొందఁ గన్నపుత్రునివలెఁ బెం
చిన వాత్సల్యపయోనిధి.
ననఘా! నిను వీడి భువిని యధముఁడ నైతిన్॥

కం॥ జనకా! మానముబూని, క
దనభూమిని బడియు నీదుతనయుఁ డొ నె
క్కనిమిషమైనను మాట్లా
డను నీ కిష్టంబు లేదొ లలితగుణేంద్రా ॥

హా! తండ్రీ! సుప్రతాపగుణరత్నాకర! శౌర్యరాశీ! దండధరునైన భండనంబున మార్కొని దండింతునిఁ జేయు నీ ప్రచండశూరత్వంబీ ముండకొడుకులచే ఖండింపఁ బడెనుగా!

సీ॥ రిపుగజంబుల నెల్ల ధృతిబూని చెండాడు
సిగ్రప్రతాపకంఠీరవంబ!
యరివర్గకాననాంతరము దిగ్భ్రమ మొందఁ
గంప మొందించు ప్రకంపనుండ!
యరివార్ధి చిత్తూరు పురలక్ష్మిపైఁ బొంగి
రాకుండఁ జేసిన రక్షకుండ!
పూర్ణవిజయచంద్రుఁ బొడగాంచి పొంగు కృ
పాకరశౌర్యరత్నాకరుండ!

తే॥ గీ॥ వారిజాక్షకులోద్భవుల్ ముఖసరోజ
ములను ముకుళించి యాహవాంబుధిని రుధిర
భూషితుండవై యమఃశితాంబుమహాబంధు
వట్లు గ్రుంకితే తండ్రీ! చీఁకట్లు గ్రమ్మ.

(ప్రవేశము — రసపుత్రులు)

బాదూలు సింగ్జీ! పరలోకగతుండైన వానిఁదలంచి పరిపరివిధంబుల విలపించిన లాభంబేమి? ఈవధకు గారణభూతుండైన రహిమానుని ద్రుంచవలయునుగదా.

బాదూల్ — ఏమి! యీవధకు రహిమానుఖానుఁడా కారణభూతుఁడు

చ॥ కలుషమదేభమైన తురకీ రిపు నారహిమాన్ఖాను నాఁ
కలిగొను సింహమట్లు పయి గంతిసి వక్షముఁ జీల్చి గుండియల్
కలఁచెద (గోరాసింగును జూపించి) జీవముల్ విడువఁ గల్గిన తం
ద్రికి రక్తతర్పణం
బుల నిడి తృప్తిఁ జేతు రణభూస్థలిసాక్షిగ సర్వసాక్షిగన్ ॥

రసపుత్రులారా! మీరీయనను నెందేని దాయుఁడు.
(నిష్క్రమించును.)

(రసపుత్రులు గోరాసింగును దీసికొని పోవుదురు.)

బాదూల్ సింగు రహిమాన్ఖానును దరుముకొనివచ్చును.)

బాదూల్.— ఓరీ!

ఉ॥ బాల్యమునందె హీనకులబాలుఁడవై దరిఁ జేరి చిత్తచా
పల్యుని మ్లేచ్ఛనాథుని నపారముదంబున డించి "కోర్కెసా
ఫల్యము జేయువాఁడ"నని ప్రజ్ఞలు సల్పిన పంద! యుద్ధకౌ
శల్యము జూప వచ్చితివె? చంపెద నిన్నుఁ గుఠారధారచేన్.

సీ॥ దొంగవై పాంథుల దోఁపించు ఠావిదిగాదు
శూరత్వమును జూపు పోరుసుమ్ము
స్త్రీలోలుడవగుచుఁ జెలఁగుట కాదిది
రాజపుత్రునితోడ రణము సుమ్ము
క్షుద్రాత్మ కడ ముఖస్తుతులు సేయుట కాదు
దండితూ క్షత్రియుద్ధంబు సుమ్ము
కాంతామణుల పొంత గంతులేయుట కాదు
మృత్యుదేవత చెంత నృత్య మిద్ది

తే॥ గీ॥ అగరు కస్తూరి గంధంబు లలది యంతి
పురములో భూషితుండవై పొంగుటయును

గాదు రక్తపరిసాధిత కాయుఁడ వయి
యమసదనము జెందుట సుమ్ము కుమతి వినుమ॥

(యుద్ధ మొనర్చి వధియించును) (నిష్క్రమించును).

(కొందరు తురకవారు ప్రవేశించి రహిమానుఖాను శవమును దీసికొని పోదురు)

(ప్రవేశము — అల్లాయుద్దీనుఁడు, నాజరుజంగు)

అల్లా—నాజరుజంగ్! మనసైన్యమంతయు నశించినది. సేనానాయకుండగు రహిమానుఁడు చచ్చినాడు. మనమిక హతశేషులైన తురుష్క సైనికులతోఁ బారిపోవుట యుచితము.

నాజర్—చక్రవర్తిగారూ. నేను మీయొద్ద నున్నంతవరకు మీకు యెట్టియాపదను రానియ్యను.

అల్లా—నీ వట్లే యనెదవు. ఇష్ట మున్న నీవు యుద్ధం బొనరింపుము. నా దారిని నేఁబోయెదను. బ్రతికియుండిన నింకొకసారి రసపుత్రుల మదం బడంపఁగలను.

నాజర్—(తనలో) ఈసారి కింత యైనది. ఇంకొకసారి యుద్ధమునకు వచ్చునఁట. (చక్రవర్తిని పట్టుకొని) నామాట లాలకింపుఁడు శత్రులచే జయింపఁబడి పారిపోవుటయుచితము గాదు. నాప్రాణముల నిచ్చియైన మిమ్ము రక్షించెదను.

(తెరలో, బాదూల్ సింగు)

ఉ॥ మ్లేచ్ఛధవు నోంటి జేసి చెరసాలను బెట్టిన యంతలోన మా
యోధవరుల్ భయంపడి పయోజముఖుం దగ నిత్తు రంచు నే
భూధవపాంసనుండు మది బొంగెను యాతని జూపుడీ వెసన్
సాధనఁ జేసి దుర్మ్మదను, సంతస మందగ రాజపుత్రకుల్॥

(ప్రవేశము బాదూల్ సింగు)

ఓరీ! తురుష్కాధమా! కంటబడితివిరా!

(అల్లాయుద్దీనుపై కేగి)

ఉ॥ ఆజిని ధైర్య మూని వసజాప్తకులోద్భవశూరకోటికిన్
తేజము వీడజేయఁ గడు తెంపునఁ బోరఁగఁ జాల కిట్టులన్
సాజములైన భీరగుణసంపదలన్ మునుగంగఁ బాడియే?
గాజులు చేత నేసికొని ఖడ్గము వేఁ ద్యజియింప నేలొకో?॥

(అని పైకి బోవును)

నాజరు—(బాదూల్ సింగున కడ్డమువచ్చి) మిత్రమా బాదూల్ సింగ్జీ!

బాదూలు—(అది వినకయే చక్రవర్తి నుద్దేశించి)

ఉ॥ ఓరి మదాంధకార! మదనోజ్జ్వలతాపము హెచ్చ హెచ్చఁగా
వీరపతివ్రతామణిని భీమమృగేంద్రుని ప్రాణనాయికన్
గోరఁగ లేదె! ఏల నిటఁ గుందుచు సంగరసీమఁ బాసితో
కోరికమీరి గొమ్ము యిదిగో యిడుచుంటిని మృత్యుకన్యకన్॥

(అని మరల చక్రవర్తిపై కేగును)

నాజరు—(మరల నడ్డము వచ్చి బాదూలుసింగును బట్టుకొని)

మిత్రమా! నాఁడు నీవు చక్రవర్తికి రాయభారం బిడ నేతెంచి నప్పుడు నాతో నెనర్చిన మైత్రిని దలంచి మిన్నకుండు వాడను గాను. నాప్రాణంబులనైన ధారవోసి చక్రవర్తిప్రాణంబులఁ గాపాడెదను. నాతో బోరి నన్ను జయించి చక్రవర్తిపైబొమ్ము. కాకున్న నీప్రాణములు దక్కవు.

బాదూల్—మిత్రమా! నాజరుజంగ్జీ! మంచిది. నిన్ను జయించియే చక్రవర్తిని వధింతును. యుద్ధమునకు రమ్ము.

(ఇరువురును కత్తియుద్ధము నొనరించుదురు)

(తెరలో)

చ॥ ఇను డపశాంబురాశి నిదియే వశిగ్రుంకెను మ్లేచ్ఛ సైనికుల్
రణమహిం బాసిపోయిరి దురంబున నోర్వఁగలేక భీతులై
వనరుహమిత్రవంశజు లపారముదంబున ముణ్గి రాజనా
గ్దమని స్కృవ ంతి రేకముగ్రగన్నన యుద్ధము నాపు సింతటన్ ॥

బాదూల్ — మిత్రమా! ఎంతపోరిన నిరుపురము సమానుల మైతిమి.
నేఁడు నీవుండ బట్టి చక్రవర్తి ప్రాణములు నిల్చినవి. యుద్ధము
నాపుటకు ననుజ్ఞయైనది. ఇక నేఁబోయెదను.

నాజరు— మిత్రమా! నన్ను జ్ఞాపకము నుంచుకొనుము.
(బాదూలుసింగు నిష్క్రమము)

అల్లా— (నాజరుజంగును కౌఁగిలించుకొని) నాజరుజంగ్జీ! నేను నీవు
నా కొనరించిన మేలునకుఁ దగినమేలును జేయుగలనా! మన
మీా భద్రగజ మెక్కి ఢిల్లీకి పోదము.





# రసపుత్రకదనము.

## చతుర్థాంకము.

### ప్రథమరంగము:— సభామందిరము.

ప్రవేశము.— భీమసింగు, లక్ష్మణసింగు, దుర్గసింగు, బాదూల్‌సింగు, అజేయసింగు మొదలగువారు.

భీమ.— రసపుత్రవీరులారా! తురుష్కులు నిశ్శేషముగా బరాజితులైరి. సమరభూమియందు ధైర్యంబునుజూపి శాత్రవుల నుక్కడించిన యోధాగ్రేసరులకుఁ దగు బహుమానంబు లొసంగితిమి. కాని (లేచి బాదూల్‌కడ కరిగి) బాదూల్‌సింగ్జీ!

మ॥ మనచిత్తూరురమా స్వతంత్రమునకుం బ్రాణంబు లర్పించె నీ
జనకుం డాహవకేళియందు మది నుంచన్బోకు దుఃఖంబు, నీ
కు నితాంతప్రియుఁడైన తండ్రి మఱి నాకున్ మిత్రుఁడా నెంతయున్
దనువుల్ రెండగుగాని యిర్వురము నెంచన్ మిత్రమా యొక్కటే॥

మఱియు నోరాజపుత్రయోధులారా!

క॥ సంగరమున మనగోరా
సింగడఁగిన కొఱఁతమనకుఁ జేర్పనిబాదూల్
సింగున కొసంగితిని జతు
రంగబలాధ్యక్షతను నిరాటంకముగన్॥

బాదూల్ — భీమసింగుమహారాజా! మీకు నాపైఁ గల్గు ప్రేమా విశేషంబున నా కీసర్వసైన్యాధ్యక్షత్వము నొసంగితిరి. కాని నన్నుమించిన యోధాగ్రేసరు లెందరీసభను లేరు? అయినను నే నందఱికంటె నధికుఁడనని గర్వపడనవసరము లేదు. ఏలయన

తే॥ గీ॥ మిత్రులందఱికంటెను మించి యధికు
డౌచు నుండంగ నెంచువాఁ డనవరతము
నందఱికిని విధేయుఁడై నట్టులేని
తన మనోరథమీడేరు ధరణియందు॥

తే॥ గీ॥ దీనిభావము గ్రహింప లేనివార
లించుక మహద్దశ ననుభవించిరేని
యింతఁగాల్చక మన నోడలంతఁ గాల్చు
కొనుచు గర్వాంధులై నశిఁ గోలుపోరె?

భీమ — సభికులారా! మన రాణా లక్ష్మణసింగునకు స్వయముగాఁ బరిపాలించు వయస్సు సమీపించినది. కతిపయదినములలో స్వపరిపాలన మొసంగ నిశ్చయించితిని. (లక్ష్మణసింగుపై పుఁ దిరిగి) కుమారా! లక్ష్మణసింగ్జీ! నేఁగరపు వాక్యంబుల శ్రద్ధతో నాలకించి తదానుసారంబుగ వర్తింపఁగలవు.

చ॥ ధర జననాథు లెప్పుడును ధర్మము దప్పక కూర్మిఁ గల్గియుఁ
నరులకు నెల్ల సౌఖ్య మిడి న్యాయముఁబూని కృపాసముద్రులై
దురితవిదూరులై రణకుతూహలులై ప్రజలెల్లఁ దమ్ము భూ
వరులని మెచ్చ రాజ్యముఁ బాలనసేయుచు నుండఁగావలెఁ॥

చ॥ ప్రజలకు గల్గు నాపదలఁ బాసి దురాత్ముల శిక్ష సేయుచున్
సుజనుల సన్నుతించి నిజసోదరబృందమువోలెఁ జూచుచున్,
భుజబలశక్తిమై రిపులఁ బోరున మార్కొని, ధైర్యమూని ది
గ్విజయమునొంది దేశముకు గీర్తివహించియు నేలఁగావలెఁ॥

ఉ॥ అన్నవిహీనులౌ జనుల నన్నసమృద్ధులఁ జేసి సత్వసం
పన్నుల సన్నుతించి మహిపాలుకతోడను మైత్రిమై దురా
పన్నుల భీతిఁదీర్చి పరపాలురు మిక్కుటమైన పన్నులం
గ్రన్ననదీసి యెల్లరను గష్టనివృత్తులఁ జేయఁగావలెన్॥

ఇట్లు రాజ్యంబుల నేలువారు సర్వజనసన్నుతులై దైవము కంటె నెక్కుడుగాఁ జూడఁబడుదురు. అట్టిమహీపాలురు కాలవశమున స్వర్గస్థులైనను మృతఁపులగుదురు యిట్లుగాక కొందఱు,

మ॥ అరయన్ జాలరు ధర్మకార్యముల గర్వాంధత్వసంప్రాప్తులై
కరుణా లేశమునైన లేక ప్రజల కష్టాత్ములంజేయుచు
బరులన్ బాధలఁ బెట్టుచుండి భువి దుర్మార్గత్వమగ్నాత్ములై॥
ధరణీపాలుర క్రూరచిత్తులగుచున్ దా మేలరే రాజ్యముల్?

అట్టి పుడమిపతులు దుర్గుణాంధులై తామొందెడు స్వల్పసౌఖ్యములకే విఱ్ఱవీగుచు నిరంతరము ధనధాన్య సంపన్నుల గృహంబుల దోపించుచు చోరాగ్రేసరులై ప్రజల కెంతయో యవమానంబొనగూర్తురు. అట్టి నిరర్థక రాజనామాన్వితులను జను లనిశంబును దూషించుచు వారెప్పుడు మృత్యుదేవతపాల బడుదురా యని యెదురు చూచుచుందురు.

ప్రవేశము:—విక్రమసింహుఁడు

భీమ—పురుషవర్యా! మీరెచ్చటనుండి యెక్కటంబున నిచ్చటి కరుదెంతిరి? మీరెవ్వరు?

విక్ర—భీమసింగు మహారాజా! మచ్చారిత్రం బతి విచిత్రంబు.

తే॥ గీ॥ జయపురిని క్షత్రియుండనై జనన మొంది
యస్త్రశస్త్రాది విద్యల నన్ని నేర్చి
బొట్టకోసమై యాజయపురిని వీడి
చక్రవర్తినిఁ గొల్వంగఁ జనితి నచట॥

క: అంత జలాలుద్దీనుఁడు
సంతసమున నాకు నొసఁగె సైన్యాధిక్యం
బెంతయు సన్మానంబును
బంతంబునఁ గాంచినాఁడ పార్థివ చంద్రా! ||

ఉ|| అంతట గొంత కాలమున కాతురకాధిపుఁ డంపెఁ బుత్రునిన్
సంతస మొప్ప దేవగిరినాథుని దర్ప మడంప వెంటనే
నెంతయు సైన్యసంఘముల కెల్ల ముదంబున నాయకుండనై
వింతగఁ గూర్చితి న్జయము వే యువరాజున కాహవంబునన్ ||

అట్లా యువరాజైన యల్లాయుద్దీనుఁడు విజయోన్ముఖుండై పిన తండ్రియైన జలాలుద్దీనుని వధింప యత్నించి యక్కార్యంబున నా సాయం బరసెను. అందులకు నే నంగీకరింప కుండుటచే యెట్టకేలకా దారుణకృత్యం బొనరించిన యల్లాయుద్దీనుడు నన్నుఁ గారాగృహప్రాప్తుని జేసెను. నే నచ్చటనుండి పలాయితుండనై రామదేవుని కొల్వు జేరి యాతఁడు మీ కంపిన లేఖలను మార్గమధ్యంబున బోఁగొట్టుకొని యీపురిఁ జేరి చిదానందయోగి వేషంబున నుంటిని.

భీమ—ఏమీ! చిదానందయోగి యన మీరేనా! అయ్యో, మీరు మా కెంతయో సాయం బొనరించితిరి. అందుకు ప్రత్యుపకారం బేమి యొనర్పగలను?

విక్ర—మహారాజా! మీరు నాకేమియుఁ బ్రత్యుపకారముఁ జేయ వలదు. నన్ను మీ కొల్వులో నుంచుకొనుటయే చాలును.

భీమ—శూరోత్తమా! అద్యాధినే మాయొద్ద నొకసైన్యోపనాయకుఁ డవై యుండుము.

ప్రవేశము—యుద్ధభటుఁడు.

భటు—మహారాజా! చక్రవర్తి సేనలన్నియు నొక్కుమ్మడి నాకస్మికముగా వచ్చి మనకోటను ముట్టడించినవి.

భీమ—ఏమీ! చక్రవర్తిసేనలు కోటను ముట్టడించినవిగా! రసపుత్రులారా! వింటిరా! ఆశ్చర్యము!

విక్ర—రాజాగ్రణీ! ఇందుల నాశ్చర్యమే మున్నది? అల్లాయుద్దీనుఁడు తాను బరాజితుండైన కతమున బ్రజలాడు దూషణవాక్యంబుల విని లజ్జాక్రాంతస్వాంతుండై యెవ్విధంబున నైన మనల జయించి కీర్తినొందుటకు మనపై దాడివెడలి వచ్చినాఁడు.

భీమ—ఓరీ! చక్రవర్తి సైన్యము లెంత సమృద్ధిగ నున్నవి?

భటు—మహాప్రభూ! ఏమని చెప్పుదును? యెటు జూచినను నాలుగైదు గడియలవరకు వ్యాపించియున్నవి.

భీమ—(ఆలోచించి) యోధాగ్రేసరులారా! ఈమారు మనదుర్గంబు నిర్మూలం బగుట తథ్యంబు.

బాదూల్—మహారాజా! మీనోటనుండి యెప్పుడును వినని మాటలు వినవలసి వచ్చినవి. మనప్రాణంబులున్నంతవరకు రాజపుత్రులు దురంబున సురాసురుల నైనను గర్వభంజితులను జేయుదురని మీకుఁ దెల్లంబేగదా.

భీమ—అవును, నిశ్చయమే. యెట్లును మనకీ మారు వీరస్వర్గము తప్పదు.

బాదూల్—రాజా! అందుల కొవంతయుఁ గుందవలదు.

భీమ—అట్లు మన మెల్లరము గతించిన మన యువతీమణులకుఁ దురుష్కులవలన మానభంగంబు నిప్పటిల్లునుగదా.

బాదూల్—రాజా! సాధ్యమైనంతవరకు దుర్గము తురుష్కుల పాలఁబడకుండునట్లు యత్నింపుదము. అంతకుమించి మనవిధి రాజపుత్రస్త్రీల కెల్లరకును "జోహారు" విధికృత్యంబు.

భీమ.— ఆహా! దైవమా! తుదకు రాజపుత్రశ్రీలక్ష్మికి దురవస్థయైన గూర్చెదవా? రసపుత్రయోధులారా! చిట్టచివరకీ చిత్తూరు రాజ్యలక్ష్మికి కెట్టి దుర్దశ రానున్నది' (తనలో) ఇక్కట్టున ఫాదుషాకు బాదాక్రాంతమైన— (ప్రకాశముగా) చిత్తమా! యేమనుచుంటివి! ఘోరమగు మనకు యుద్ధంబు తప్పదు. బాదూలుసింగ్! సీవు సైన్యముల నాయత్తపఱుపుము. రసపుత్రులారా!

తే॥ గీ॥ ప్రాణములపైని ప్రీతిని బారద్రోలి
పోరుడీ మీరలాహవ భూమియందుఁ
బడిన మీయందు నెక్కడేపమను వార
లందుఁ బదుగురు నొకతూరి యవనిఁ బడరె?

తే॥ గీ॥ యెదురుగా మృత్యుదేవత యొదవుచున్న
దనుచు నేనుదీయకుండి యుద్ధమందు నూాల
దాగినను మృత్యుదేవత తప్పగలదె?
వీరవరులార! రసపుత్రశూరులార!

ఇక సత్వరము మీరెల్లరు యుద్ధసన్నద్ధులై యుండుఁడు.
(నిష్క్రమము)

ద్వితీయరంగము:— సమరరంగ సామీప్యప్రదేశము.

ప్రవేశము:—భీమసింగు.

భీమ.—

చ॥ మనసు కలంగ సాగెను ప్రమాదము సంభవమౌనొ యిప్డు నా
కనులకు నెల్లవస్తువులు కాంతివిహీనములై తోచుచుండె నా

తనయులఁ దల్చినప్డు డమితంబగు సందియ మొందుఁ గల్గుచుం
డెను రణరంగముక్ విడిచి నేనిట వచ్చిన దాది యేలొకో! ॥

సీ॥ భూమ్యాంబరంబులుఁ బొరలుచు రక్తసి
క్తములైన యట్లునేఁ గాంచి నిపుడు
దశదిశలను బ్రతిధ్వను లెసంగిన యట్లు
చిత్తంబు దిగ్భ్రమాయత్తమయ్యెఁ
దగుననురాహామును లెల్ల సరసీరుహలై తల
క్రిందుగా నడచు నట్లిందుఁ దోఁచెఁ
బలుమారు వారిజాక్షుల రోదన ధ్వనుల్
శ్రవణకుహరములఁ బ్రబలమయ్యెఁ
తే॥ గీ॥ బ్రళయదావాగ్ని యెల్లెడఁ బ్రజ్వరిల్లి
సకలమును దగ్ధమొనరింప సాగనట్లుఁ
దోఁచెమిన్నేదో మన్నేదొ తోఁచ దిప్పు
డివ్విధం బాతకును హేతు వేగియగును.

(ఆలోచించి) నేను దక్షిణవైపు కోటకొమ్మలను గాపాడుచుంటినే! ఈనిర్జనసీమ కెట్లు రానయ్యెను? (యోచించి) రిపుసైన్యధాటీ పలాయితుండనైతినా? అట్లెలనగును? యేదియో విషయము నాలోచింప వచ్చితిని. (ఆగ్రమ్మునఁజేయిడి) హృదయమా! యేమనుచుంటివి! "దుర్గంబు తురకల కధీనంబైన నీవేమిచేయఁగలవాడ" వనియా? ఆ! ఏమి! దుర్గంబు మ్లేచ్ఛులకా యధీనంబగుట? అకల్పనంబును సంభవింపదు. (ఆలోచించి) జయాపజయంబులు దైవాధీనంబులు గానఁ నొకవేళ నెట్లైన చిత్తూరు రాజ్యలక్ష్మి పరాధీనంబైన నేమిచేసెదను? రసపుత్రవీరులు తురుష్కులను కోటలోనికిఁ బ్రవేశింప నిత్తురా? భానుకులప్రదీప్తు లెల్లరును రణనిహతులైన.గదా శత్రువులు దుర్గమును వశపరచుకొనుట! ఒకవేళ నట్లెల్లరు సమరమందు సంఘమరణము నొందిన రాజపుత్రస్త్రీల కెల్లర కా తురుష్కులచే మానభంగంబుసంభ

ల్లగలదు. ఔరా ! రసపుత్రస్త్రీలకు మానభంగంబు చేకూరునుగా ? వారియెడ మానభంగింబుఁ దలపెట్టుట మండుచున్న దావానల జ్వాలలను బిగియారఁ గౌగిలింప డాయంజనునట్లగదా.

(తెరలో)

ఉ॥ దక్షిణదిక్కుడ్యములు ధారుణిఁ గూలఁ దోడంగె శాత్రవా
ధ్యక్షులు కోటగోడఁ బ్రయాసముతో నెగబ్రాకు చుండి రా
దక్షిణ దిక్కుకుడ్యములఁ దా నతిధీరతఁ గాచు భీమహా
ర్యక్షము సంగరంబున విహార మొనర్చుట లే దదేలకో ?

భీమ—(ఆలకించి) ఏమీ ! దక్షిణదిక్కు—!! ప్రాకారంబులు సంరక్షించుచున్న నన్నుఁ గానక సైనికులిట్లు బలుకుచుండిరి. నే లేకుండుటఁ జూచి యాతురుష్కులు ప్రాకారంబులమాపు మాపఁ గడంగిరి. ఓహోరి తురుష్క సైనికులారా ! యిదియే వచ్చుచుంటిని. ఇఁక మీ ప్రయత్నములు సాగవుసుమా. (అనికత్తినెత్తి క్రిందవైచి నిర్విణ్ణుండై)

చ॥ బలరిపుమస్తకంబుల సభస్థలి పై కెగయంగ కంధరం
బులఁ దెగ వ్రేయుచో నయినఁ బోరున మత్తగజాళి తుండముల్
దలఁపడి కోయుచో నయినఁ దగ్గదొకించుక యేని మన్ముజా
బలమది యిప్పుడిట్లు కరవాలము నెత్తఁగఁ జాలదయ్యె నీ !
ఇప్పిధి మదీయదోర్బలం బెల్లఁ దరిగెనా ! లేక

చ॥ సమరమునందు శాత్రవులఁ జక్కగ నుగ్గు నొనర్పకిట్లు డెం
దమున మదార్ద్రసంగతిని దల్చుచు మిన్నక కూరుచుంటి నీ
సమయమునందు గాన "నిఁకఁ జాలు యశో"స్సని వేగ ఖడ్గర
త్నము నను వీడ నెంచితివె ? దానునితప్పులు కావు మిత్తరిన్.

(కూర్చుండును)

ప్రవేశము:—పురదేవత

పుర— భీమసింగ్జీ! భీమసింగ్జీ!

భీమ—(దిగ్గున లేచి) ఎవరు నన్నుఁ బిలిచినది! (పురదేవతను జూచి యంజలిబద్ధుండై)

ఉ॥ ఆలమునం జరించు భయదాకృతిఁ దాల్చిన భూతరాజ్ఞివో!
కాలవశంబునం జనులఁ గాలునిపాలికి నంపు దేవివో!
వేలకొలంది కోర్కెలిల పెంచిత దేవ పురలక్ష్మివో! యికన్
గాళివొ! నీపదాంబుజయుగంబునకు బ్రణమిల్లెదన్ వెసన్ ॥

(మ్రొక్కును)

పుర—రవికులపుంగవా! నీ వెవ్వరనైన నేమి? మదభీష్టంబు సిద్ధింపఁ జేసెదవా?

భీమ— (తనలో) చూడఁబోయిన నీ పురదేవతయని స్పష్టమగుచున్నయది. (ప్రకాశము) తల్లీ! భవదభీప్సితం బెయ్యదియో యెఱింగించిన నాశక్య మగునేని యొనర్చెదను.

పుర—భీమసింగ్! మన్మనోరథము బెద్దదైన నేమి? యీడేర్చెదవా?

భీమ—జననీ! భవదీప్సితం బెఱిఁగింపకున్న నెట్లు దీర్పఁగలను? ఆ పెద్దదియో యెఱిఁగింపఁ బ్రార్థించుచున్నవాఁడ.

పుర— రాజోత్తమా! సూర్యకులంబున కింతకుఁ గళంకమ్ముఁ దెచ్చుచుంటివి! నావాంఛితం బెద్దియో యెఱిఁగించినట్లయినఁ దమ చేతనగునట్లు సమకూర్చువా రెందరు లేరు? నేను నీయొద్దకే రావలసినయవసరమే మున్నది? నాకోరిక నెఱవేర్చెదవా? లేకున్న నింకెవరికడకైనఁ బోయెదను. (పోఁబోవును)

భీమ— తల్లీ! తల్లీ! ఈ సేవకునియెడఁ గరుణ వహింపుము.

కం॥ విలసిల్లెడు రాజ్యంబో
వెలుఁగులభూషణములో, సువేదనలో, కో
మలులో భవదభీప్సితములు
తెలియఁగాఁ జెప్పుము నాకు దేవీ! ఘనమహిమా.

పుర — కుమారా! యిప్పు డెప్పినవానిలో నెద్దియును గాదు. నేఁ గోరునది నరబలిగదా.

భీమ — జననీ! నరబలియా? అందున కేమిటక్కఱ యైనది? జరుగుచున్నది మహాసంగరము గదా?

పుర — అయిన నేమి?

భీమ — మనసునకుఁ దృప్తియగునట్లు నరులు దెగుచునే యుండిరి. అందారగింపఁగూడదా?

పుర — కుమారా! నేను ప్రేతభూముల సంచరించు భూతపిశాచవర్గములోఁ జేరియుంటిననియా నీ యభిమతంబు?

భీమ — అట్లయిన నోమాతా! నోరులేని జంతువుల బలి నొసంగుట నా యధీనముగాని నేను నరపాలకుఁడనైన మాత్రమున నస్మద్దేశమునందు సమానహక్కులతో జనన మొందినవారిలో నెవరిని నీకు బలియిత్తును? నేను నరపాలకుఁడగాని నరహంతకుఁడను గానుగదా. నాదేహముపై మాత్రము నా కధికారముగలదు. నన్ను నీ కత్తి కెఱగాఁ జేసికొని సంతృప్తి నొందుము.

పుర — భీమసింగ్జీ! వృద్ధాప్యంబు సమీపించిన నిన్నారగించిన నా కేమి తృప్తిగల్గును. నా కొకరిద్దరు గారు. పదునొక్కండ్రు గావలయును. కావున నీకుమారులలో పదునొక్కండ్రను బలినిమ్ము.

భీమ — తల్లీ! నాకుమారులనే కోరితివా! (ఆలోచించుచుండును.)

పుర—భీమసింగ్జీ! తడవయ్యెను. మరల నే నెల్లి దర్శనంబిత్తు.

(నిష్క్రమము.)

భీమ—ఏమీ! ఇది కలయా! నిక్కమా? నిక్కమముగా నా కుల దేవతయే ప్రసన్నంబైనదా? (ఆలోచించి) ఆహా! నిజముగా నాదేవియే ప్రసన్నంబైనది. ఔరా! ఆమె నా కుమారులలో పదునొక్కండను గోరెనుగదా! రణభూమియందు వారలగతి యెట్లున్నదో ?

ప్రవేశము.—శూరసింగు.

భీమ—శూరసింగ్జీ! రణభూమినుండి వచ్చితివి గదా! అందలి విశేషంబు లేమి?

శూర—మహారాజా! యుద్ధభూమియందలి సమాచారము నేమని నుడువగలను. నాఁ డర్ధరాత్రంబునఁ జక్రవర్తి సకలసైన్య సమేతుడై యాకస్మికంబుగ దుర్గంబును ముట్టడించి మాస త్రయమునుండియు దానిని వశపఱచుకొనవలెనని బహువిధ ప్రయత్నంబు లొనరించుచున్నాఁడు. ఇట్లనంత విశేషసైన్య సంధానంబులతో నరుదెంచి ప్రథమమునఁ బదునైదు దినములవఱకును నంభోరాశికైనయగు సగడ్తను బూడ్చ యత్నించి యెట్టకేలకు సఫలీకృతమనోరథుం డయ్యెను. అట్లమ్మహా కార్యము నిర్వహించుకొని తదనంతరము దుర్గంబున కే దెసఁ జూచినను నాలుగుగడియల దూరమువరకు వ్యాపించియుండిన చతురంగబలంబును, హయహేషధ్వనులును, గంధగజఘీంకారంబులును, భేరినినాదంబులును, దిగ్గజంబులడలంగ మ్రోగు గుణధ్వనులును గల్గి చూపరుల కపరిమితానందభయదాయకంబై యంభోనిధు లొక్క పెట్టునఁ బొరలి చిత్తూరుదుర్గమును ముంప వచ్చెనో యనునట్లు రసపుత్రశూరశిఖామణుల కెల్ల

నత్యంత విషాదంబుఁ బొందఁ జేసెను. అంత నూతనముగా సైన్యాధ్యక్షతను వహించిన బాదూల్ సింగీతెఱఁగంతయు నవలోకించి దుర్గంబున కుత్తర ప్రాకారరక్షణార్థమై రణజిత్ సింగును, ప్రాగ్దిశా ప్రాకారంబులపై సంగ్రామసింగును, నపర దిక్కున దోర్దండమునఁ బ్రభాకరుండగు ప్రభాకరసింగును దగు సైన్యంబులతో నియమించి తాను నలుదెసల. గను బాగిమూకతో సంచరించుచు: నితరరజపుత్రపతులకెల్ల రణోత్సాహం బొనరించుచుండెను.

భీమ—(తనలో) దక్షిణవైపున నీవు రక్షించుచుంటివని. (ప్రకాశము) యింతవరకును నీ వెఱింగినది. తరువాత.

శూర—తరువాత నో దేవా! తురుష్కసేనాని యగు నాజరుజంగా దుర్గప్రాకారంబులపై నలుదెసల రక్షించుచున్న రజపుత్ర సైన్యంబులఁ గని యొక్కింత నిరాశాయత్తచిత్తుండై మరల ధైర్యం బవలంబించి మ్లేచ్ఛసైనికుల నొక్కుమ్మడిఁ గోటకొమ్మ లెక్కఁ బ్రాక నాజ్ఞయిచ్చెను. అంత నా రజపుత్రులు శితశరా గ్నిం బ్రజ్వరిల్లఁజేసి రిపుసేనల నెల్ల దిగ్భ్రమం బందఁ జేసిరి. అప్పుడా తురుష్కసైనికు లెల్లరుఁ గలవరపడుచు నట్లా కదనభూమి నుండి నిలింపావాసంబున కెగురఁ గొట్టఁబడు తురకల శిరంబులఁ గని మత్తేభంబు లెల్ల నున్మత్తసంప్రాప్తంబులై తమ చరణప్ర హారణంబుల స్వసైనికానీకంబుల నుగ్గొనర్చుచు తుండంబుల నెత్తుకొని ఘీంకారారవంబు లొనరింపుచు రజపుత్రుల కత్యా శ్చర్యంబును, దురుష్కుల కమితభయంబును జనింపఁ జేసెను. అంతఁ గొంతవడి కా యేనుంగు లున్మాదంబు దృజించి వాని వాని స్థానంబులఁ జేరిన యనంతర మా మ్లేచ్ఛసైన్యాధ్యక్షుఁ డేలాగో దుర్గంబునకు దక్షిణదిశనున్న కుడ్యంబుల మాత్రముఁ గూల్చిన ట్లానతి నొసంగెను. అంతఁ దురుష్కసైనికు లెల్లరు

హా! పతంగవంశోద్ధారకులారా! నవమాసములు మోసి కని యెంతయో శ్రద్ధతోఁ బెంచిన మీజననియొక్క శోకానలం బెట్లార్పఁ గలవాఁడను?

శూర.—మహారాజా! యిన్నియు నెఱింగిన మీరే యిట్లు బేలలై వాపోయిన నింక లోకంబున నితరులైన సామాన్యపుత్రులవిషయమై యేమి చెప్పఁగలను.

భీమ.—శూరసింగ్జీ! యిదనంతర మేమైనది?

శూర.—తదనంతర మో దేవా! యిట్లు పదునాల్గురు నొక్కసారి మడయుట వీక్షించి శిథిలశేషంబులైన ప్రాకారంబుల భూమి చదరంబులఁ జేసి కోటలోఁ బ్రవేశింప సమకట్టు ప్రతిపక్ష సైన్యంబులఁ గని రసపుత్రసైన్యనాయకుండగు దుర్గసింగత్యంత కోపావేశంబున మండిపడుచు నిశితాసిపత్రంబును గిఱగిఱం ద్రిప్పుచుఁ దనసైన్యంబుతోఁ దురుష్కసైన్యంబులపైఁ జెలరేఁగి యొక్కొక్క బాణపుంజంబునఁ బెక్కుమందిని తెగవ్రేయుచు శస్త్రాస్త్రవిద్యాపారంగతను వెల్లడిచేయుచుండ మ్లేచ్ఛసైన్యనాయకుండగు హాసనల్లీఖానుఁడు తనసైన్యముల నొక్కుమ్మడిని రసపుత్రవీరుల నెదుర్కొన నాజ్ఞనిచ్చి శిథిలప్రాకార రక్షకులైన రసపుత్రులనెల్ల దునుమాడి మనదుర్గసింగును గూడ స్వర్గమున కంపెను.

భీమ.—ఏమీ! రసపుత్రయోధుల దురదృష్టము! తల పడినవారిలో నొక్కండైనను గడచి రాకుండెను! తరువాత, తరువాత.

శూర.—అనంతర మో ప్రభూ! దుర్గసింగు స్వర్గస్థుఁడౌటఁ గని రణజిత్ సింగు తనసైన్యంబులతో నొక్కపెట్టునఁ దురుష్కుల నెదు ర్కొని వివిధగతుల దునుమాడుచు తననామంబును సార్థకపఱచుకొనుటఁ గాంచి రసపుత్రయోధులు శిథిలంబులైన ప్రాకా

రంబుల దాఁటివచ్చు తురుష్కులను శిలాప్రవర్షంబులచేతను, సలసలకాగునూనెచేతను యమసదనమున కంపిరి. అవ్విధంబునఁ దామొనర్చు సాధనంబులన్నియు వ్యర్థంబులౌటం గని తురుష్కనాయకుండు డొంకింపు మానిలఁ దూర్పువైపునను ప్రా కుడ్యముల ధ్వంసముఁ జేయ నుద్యమించెను. అవియును నిర్మా లంబైన నీకి దుర్గమును రక్షించుట దుర్లభంబని తలంచి రసపుత్రసేనలన్నియు నత్యాతురతతో దక్షిణవైపు రక్షించుట మాని తూర్పు వైపున కేగిరి. అంత రణజిత్ సింగు స్వల్పసైన్యముతోనే యరివీరుల నెదుర్కొని ఘోరముగాఁ బోరుచుఁ గొంతవడికి విపక్షులచే నిర్మూలింపఁ బడిన సైన్యంబును జూచి యొక్కింతయు భీతిఁ జెందక కత్తిని డాలునుఁ బూని తెగిబడి రిపుల ఖండింపఁ జొచ్చె. అత్తఱి రణజిత్ సింగుకరవాలధారాకఠినమైన తురక సైనికులును, శుండాలంబుల తుండంబులును నిన్నియని యెన్న శక్యంబుగాదు. ఇవ్విధం బవలోకించి నాజరుజంగు క్రోధాంధభూతచేతస్కుండై యెవ్విధంబున నైన నా రణజిత్ సింగును రణనిహతునిఁ జేయ నుంకించి తానును గత్తియు డాలును ధరించి రసపుత్ర యోధాగ్రేసరునితో ద్వంద్వయుద్ధంబునకుఁ దలపడెను. ఇట్లు రసపుత్ర తురుష్కవీరవరు లిరువురును సింగంబులపగిది బోరుచుండ నుభయ సైన్య సంఘంబును సంకుల యుద్ధంబు నాపి చిరకాలములకుఁ జూడఁ గల్గిన యాద్వంద్వయుద్ధంబు నత్యంత కౌతూహలంబున వీక్షించుచుండిరి. తురుష్కులు ప్రాకార నిర్మూలనము మానిరి. రసపుత్రులు తద్రక్షణ మాపిరి. అట్లా యిర్వురు కొంతకాలము పోరిన పిదపఁ దురుష్కయోధుండొక్కింత యలసినట్లుఁదోచిన మ్లేచ్ఛ సైనికు లెల్లరు నాతనికిఁ బ్రోద్బలం బొసంగుచుండిరి. మన సేనలు రణజిత్ సింగు విజయోన్ముఖుండగు నని నిశ్చయించి బిలబిలం ద్రిప్ప బడుచున్న

ఖడ్గము యొక్క ప్రచండకాంతులచే నావరింపఁబడిన దేహముతో మధ్యందినమార్తాండునువలెఁ బ్రకాశించుచున్నరసపుత్రయోధాగ్రేసరుని వికసితపద్మనేత్రంబులతో నవలోకించుచుండిరి. అంత నాతురుష్కచమూపతి ప్రోద్బలపూరితుండై రసపుత్రయోధుని శిరస్సునకుఁ దనవాడికత్తినిఁ గురిచూపి యావచ్ఛక్తితో నొక్క దెబ్బగొట్టెను. ఆదెబ్బతో రసపుత్రుని పని దీరిపోయినని తురుష్కు లెల్లరు సత్యాంతసంతోషాక్రాంతస్వాంతులై "శహబాస్! శహబా"స్సని కేకలు వేయసాగిరి. రసపుత్రులు ముకుళీభూతముఖాంబుజాతులై యుండ మన రసపుత్రయోధుండా దెబ్బఁదప్పించుకొని మఱల నాతురుష్కుని తనఖడ్గంబుచేఁ గొట్టెను. ఆదెబ్బతో నాతురక నృత్యాంతునిశాంతంబున కేగియుండవలసినదె కాని యాతని శిరస్త్రాణమునకుఁ దగులుటచే మన రసపుత్రుని కరవాలంబు రెండు తునక లయ్యెను.

భీమ.— ఆహా! మోసము సంభవించినదే! పిదప నేమైనది?

శూర.— పిదప నోరాజా! మనరసపుత్రయోధుండింకొక యాయుధంబుఁ గానమింజేసి నాకీ తలకెంగతురుష్కునకు నిరాయుధుండైయున్న మన రసపుత్రునిఁ జంపశక్యంబుగాకుండుటచే వధచ్ఛేదనాంగీకరించి సంగరక్షోణీతలంబునకు బలి నిచ్చెను.

భీమ.— హా! శూరాగ్రేసరా! రణంతకసింగ్! వయోవృద్ధుండవైన నిప్పుడు నిరాయుధుండవై సమరభూమిని వధింపఁబడితివి గదా! శూరసింగ్! అంతట నేమైనది.

శూర.— దేవా! అంత నారసపుత్రుండు గూలిన జయశబ్దంబులతో దురుష్కులు మఱలఁ బ్రాకారంబులఁ గూల్ప నుద్యమించుచుండిరి. నన్ను బాదూల్‌సింగు మీరచ్చటనుండిరో యరసి రమ్మని పుత్తేరెను.

ప్రవేశము:— బాదూల్ సింగు

భీమ— బాదూల్‌సింగ్జీ! సమరభూమిని బాసివచ్చితివేల?

బాదూల్— రాజా! రాకేమున్నది?

ఉ॥ వ్యర్థములయ్యె బాణములు వ్యర్థములయ్యె శిలాప్రపర్షముల్
వ్యర్థములయ్యె సాధనము లన్నియుఁ గూలెను గోడలెల్లనో
పార్థివచంద్రమా! మునుకు వచ్చెను నాశనకాల మక్కటా!
వ్యర్థము సెక్కుఁవంబు రిపువర్గముతోఁ గదనంబుఁ జనసన్॥

ఇఁకఁ బురుషులెల్లరును దుర్గమందుఁ బ్రవేశించుట నిశ్చయము. కావున మనము శత్రుసేనలతోఁ దలపడి ప్రాణములపై నాసను విడి పోరుట కర్తవ్యము.

తే॥ గీ॥ జయమునొందెదమో లేక సమరభూమి
బోరి స్వర్గంబు నందగలార మేమొ
కాన జయమందిన గల్గిన ఘనయశంబు
వచ్చు; గాకున్న మనస్త్రీలు పరిభవంబు
నొందగలవారు రిపులచే నిందు నధిప!

ఇట్టి విపత్తులచేఁ బరిభవానలసంతప్తులు గాకుండ మనరాజపుత్రస్త్రీల రక్షింపవలయు.

భీమ— బాదూల్‌సింగ్జీ!

తే॥ గీ॥ తురకనాథుని కోడ చిత్తూరునందు
మనస్వాతంత్ర్యము విడనాడి మనుటకన్న
విజయమందిన సరె; లేక విఫలమైన
యెడలఁ జత్తుము దురమున నెల్లరమును.

ఇది మువ్వాటికిని సత్యంబు ఒకవేళ మనమెల్లరము రణనిహ

తుల మైన యెడల మన కాంతామణులు తురకలచే నవమానింపఁ బడుట నిజము. అట్లు మానభంగము బొందకుండు నట్లు

తే॥ గీ॥ మండుచున్నట్టి యొక యగ్నికుండ మందుఁ
బ్రథమమున స్త్రీల నందఱఁ బడఁగఁ జేసి
పురుషు లెల్లరమును యుద్ధభూమియందు
ఖడ్గములఁ బూని పోరఁగ నుచితముగ॥

బాదూల్ — మహారాజా! ఇట్లయిన సరేగాని మన సూర్యాబాలగోపాలంబును బ్రాణంబులు గోల్పోయినఁ జిత్తూరు రాజ్యలక్ష్మి నెన్నటికైనను రాణాసంతతివా రేలుట కల్లగదా!

భీమ — (ఆలోచించి) బాదూల్‌సింగ్జీ! ఇట్లయిన నక్షత్రియ ప్రాయుండైన నాపౌత్రుని నేఁటిరాత్రియే పట్టాభిషిక్తునిఁ జేసి హతశేషుండైన మత్కుమారునితో నడవులలోఁ దలదాచుకొని యెన్నటికైన చిత్తూరురాజ్యంబు నేలఁ గల్గుటకుఁ బంపుదము. శూరసింగ్జీ! తదితర రజపుత్ర యోధులనెల్ల యుద్ధంబునాపి మద్భవనంబునకు రమ్మని చెప్పుము. మీరును సత్వరమున వారితోఁ గలసి మద్భవనంబునకు రండు.

---

తృతీయరంగము: సభామందిరము.

ప్రవేశము:— భీమసింగు, బాదూల్‌సింగు, విక్రమసింహుఁడు, అజేయసింగు, హమీరు.

భీమ — (హమీరు నెత్తుకొని) బాలకా! పతంగవంశోద్ధారకా!

చ॥ జనకుఁడు మాతృరక్షణకు సంగరమందుఁ ద్యజించెఁ బ్రాణముల్
జననియు భర్త వెంబడి విచారపయోనిధిమున్గి పీడఁ దాఁ

దనువును; రాజ్యమేలగను దక్కితి పిన్న సుమీ యొకండవే
ఘనముగ నెన్నఁడేని రిపుగర్వ మడంచి యశంబు నొందుచున్
కుమారా! అజేయసింగ్జీ!

ఉ॥ నీ విపు డీ కుమారకుఁ డనెయ్యమునం గనుఁగొంచు వేగ నా
నావిధదుర్గమోగ్రనిబిడంబులచేఁ బరివేష్టితాలయం
బై నిలుచుచున్న సమ్యగావళికాలయంబునైన యా
రావళిపర్వతంబులఁ గగంబు సుఖంబుగ నుండు డీర్ష్యరున్॥

ఉ॥ అన్నకుమారుఁ డౌచితనియం దొక యింతయు నిర్వ్యపాయ క
ర్తృన్నతసత్కృపాపరిమితోజ్జ్వలభానముఁ బూని యాదుకా
పన్నుల భీతిఁ దీర్పఁగల పంకజనాభుని మీఁద భక్తితో
యన్నగపంక్తులందు తనయా! మును బాలుని పెంచు మిమ్ముగన్॥

అజే—జనకా! మీరెల్లరును సమరమున వీరస్వర్గంబు గాంద నేనొక్కం
డ నశేషబాధుజాలంబునకై శోకించుచు మనఁగలనా?

భీమ—కుమారా! నా పలుకు లాలింపుము. సీవిందుల కంగీకరించవేని
కదు: భిన్నవయస్కుండగు నీబాలుని బోషించువార లెవ్వరు?
కావున మదాజ్ఞ శిరసావహించి చిత్తూరురాజ్యహితార్థ మల్లోన
రింపుము.

అజే—అట్లే మీయాజ్ఞానుసారమున వర్తింతును.

విక్ర—అజేయసింగ్జీ! ఆజ్ఞను శిరసావహింతువు గాని,

సీ॥ అప్పుడప్పుడు తప్పటడుగు లేయుటెఁ గాని
తోడిబాలురఁ గూడి యాడ లేఁడు
మాధుర్యమౌ ముద్దుమాటలాడుటెగాని
పల్కరించిన మాఱువల్క లేఁడు

కడుఁగూర్మితో తల్లి యంకమున నుండుటగాని
దాసీజనంబుల దరికిఁ బోఁడు
అంతిపురమున నస్రాంత ముండుటగాని
కానఁ డాదిత్యుని కాంతి నెపుడు
తే॥ గీ॥ చారుసుకుమారు మన్మథాకారసముని
నీసుకుమారుని క్షుద్రమృగాకులంబు
నైన నిర్జనకాంతారమందు నెట్లు
చేర్చి మేలఁకువతోడఁ బోషింపఁ గలవా!

భీమ— బాలకా! పౌత్రరత్నమా!

సీ॥ మోహనాకారులఁ బోషగన్న భయమందు
నీవు భిల్లుల జూచి నిలుచు టెట్లొ
ఆర్ద్రబాలుర గూడి యాడజంకెదు నీవు
వనమృగంబులమధ్యఁ బరగు టెట్లొ
మలయమారుతమున నిలువఁజాలని నీవు
ఝంఝానిలంబును సైచు టెట్లొ
హంసధ్వనిని విని యుడలెద వీవు సిం
హేంద్రనాదముల సహించు టెట్లొ
తే॥ గీ॥ కన్నడలపాలు సేయ నిన్ గహనములకుఁ
బంపుచుంటిని భూధవపాంసనుండ
శ్రీప్రదం బగు రాజ్యాభిషిక్తుఁడ వయి
వెలయు మెపుడేని తురకల బల మడంచి.

విక్ర— తండ్రీ! సూర్యవంశోద్ధారకా!

సీ॥ క్రూరమదేభశార్దూలాదిమృగములే
యాటబాలకులు నీ కగుదుసుమ్మొ
గాఢాంధకారసంగతమహాభ్రగుహాంత
గంబులే నీకు సౌధంబు లగుచు

సకలకళాపూర్ణచంద్రుండుఁ దేజోని
    ధియు నీకు ననిశంబు దివ్వెలగును
గహనసంచారశృంగార విపినదేవ
    తలె నీకుఁ బ్రేముడి తల్లులగును
తే॥ గీ॥ నీదుపినతండ్రియే యగును నీకు గురువు
    వివిధశస్త్రాస్త్రవిద్యాప్రవీణుఁ జేయఁ
    గలఁడు నిన్నతఁ డెట్టిని కడగి మీస్వ
    తంత్రరాజ్యంబు నేలుము తనయ! నీవు.

లక్ష్మ— బాలకా! నాపలు కాలకింపుము.
    తే॥ గీ॥ ఆయిరువందల యేబదియైన వత్స
    రములనుండియు మీవాడ్ స్వరాజ్య మేలు
    చుండి రసపుత్రు లీమేడ నూరకుండి
    దైవవిధి మ్లేచ్ఛులకు నీయఁదలఁచి రద్ది॥

బాదూల్— బాలకా! ఒక్కపర్యాయం బీచిత్తూరుదుర్గంబునుగన్నులారఁ గనుము.

చ॥ సకలకళావిహీనయయి సత్పతి తన్ను బరిత్యజించి యిం
    కొకనివశంబుఁ జేయఁగలఁడో యని డెందమునందు గుందు నా
    వికచపయోరుహాస్యవలె వే కనుపట్టు చిత్తోడ్ పురంబు నీ
    వకట! కనుంగొనంగలిగి తౌరకుమారక! మెట్టకేలకున్.

భీమ— లక్ష్మణసింగ్జీ! రాజపుత్రశూరులారా! ఈబాలుని మీవాక్ రాజ్యంబున కంతకుఁ బట్టాభిషిక్తునిఁ జేసెద. ఇందులకు మీ యభిమతం బేమి?

లక్ష్మ—మహారాజా! మీయభిమతంబే మాయభిమతంబు. సత్వర మట్లొనరింపుఁడు,

**భీమ**— (బాలుని సింహాసనమునఁ గూర్చుండఁబెట్టి యాతనిశిరంబునఁ గిరీట ముంచి) బాలకా!

తే॥ గీ॥ అస్త్రశస్త్రాది విద్యల నన్ని నేర్చి
కరకుతురకలగుమిని సంగ్రామమందుఁ
దుమిచి యశమునుగాంచి చితూరుపురంబు
వశపఱచుకొని యేలు "మీవాడ్" కుమార॥

(అజేయసింగునువైపుఁదిరిగి) కుమారా! అజేయసింగ్జీ! ఈబాలుని పట్టాభిషిక్తునిఁ జేసితిని.

సీ॥ సకలదేశంబుల సన్నుతిఁగాంచిన
భరతమాతయె యిందుఁ బ్రథమసాక్షి,
తరతరంబులనుండి తిరుగాడు స్వాతంత్ర్య
దేవియే యిందు ద్వితీయసాక్షి,
ఘోరసంగ్రామసంచారిణి యా మృత్యు
దేవతే యిందుఁ దృతీయసాక్షి,
రసపుత్రశౌర్యవిరాజితం బైన చి
తోడ్దుర్గ మిందుఁ జతుర్థసాక్షి,
తే॥ గీ॥ సరగ జయలక్ష్మి పంచమసాక్షి యిందు
నిట్లు పంచసాక్షులు గల్గు నీకుమార
కునకుఁ దప్పక తుర్కభారము నిడు మెప్పు
డేనియును చితూర్ మీకు స్వాధీనమైన॥

అజేయసింగ్జీ! ఇఁక నీ వీకుమారుని గొంపొమ్ము.

**అజే**—తండ్రీ! అట్లే యొనర్చెద. (పోఁ బోవును)

**బాదూల్**—(బాలు నెత్తుకొని) కుమారా!

ఉ॥ శూరులు పెక్కు రుండియుఁ బ్రశోభితసూర్యకులంబు నంతకున్
దీరనివంకఁ దెచ్చి రని తేకువఁ బూనకు మయ్య! నీవె హా
ధీరత సంగరస్థలినిఁ ద్రెంచి తురుష్కులఁ గీర్తినొంది చి
త్తూరుపురంబుఁ జేకొనఁగ దుర్గమసీమల కేఁగుచుంటివే॥

(అజేయసింగు, హమీరును నిష్క్రమింతురు.)

భీమ.—రాజపుత్రయోధులారా! మీమీ సదనంబులకేఁగి మీ కాంతామణుల నెల్ల రేపుదయంబున "జోహా" రొనరింపు నట్లాడంబరపుఁడు.

(నిష్క్రమము.)





# రసపుత్రకదనము.

---

## పంచమాంకము.

ప్రథమరంగము. పద్మినీదేవి యంతఃపురము.

ప్రవేశము-పద్మినీదేవి.

పద్మి—(విచారముతోఁ గూర్చుండి)

ఉ॥ అకమలార్క నిల్చెడు వియత్స్థలమందు; సుషుప్తినొందకే
వ్యాకులచిత్తనై యుంటి. లపారమనోవ్యథ హెచ్చుచుండఁ దే
జోకరవంశజాతులు యశోంచితమూర్తు లహర్నిశంబులున్
నాకార కుగ్రుతాంచు మరణాంబు రణంబున నొందుచుండఁగన్॥

ఆహా! నేఁ డెవ్వరిపాపము మొగంబుఁజూచితినోగాని యెట్టిపల్కులు కర్ణాకర్ణిని దెలియనయ్యెను! దైవమా! ఏల నన్నీత్రిజగన్మోహనాకారిణిగా నిర్మించితివి? అన్యసామాన్యస్త్రీవలె జన్మింపఁ జేసిన నన్నానన్యమృగతుల్యుం డగు చక్రవర్తి తనమానస మీనంబును, మద్వీక్షణాంచలముచు గాలముగాఁ గల్గిన మరున కెరఁ జేయకుండునుగదా! ఇాదఱు రసపుత్రవీరులు క్రోధానలదహ్యదేహులై యీ మనోభవగ్రహావేశుండగు నా తురుష్కనాథుని సైన్యసమేతంబుగా భూతబలి నీయఁ గడంగి యివ్విధి రణనిహతులు గాకుందురుగదా! నిత్యకళ్యాణ సౌభాగ్యవతియగు నీ చిత్తూరుపురలక్ష్మి భవిష్యదాగమ దుర్ద

శావలోకనసంజనితభీతచేతస్కురాలై యశ్రూదకసిక్త వక్త్రాంబుజాతయగుట సంఘటింప కుండును గదా! ఈతురుష్కనాథుండు,

ఉ॥ ఈవిధ నన్యకాంతఁగని యిక్షుశరాసనసాయకాగ్నికిన్
భావము నప్పగించి నృపపాంసనుఁడై సమరంబునందు మా
పావనవంశసంభవుల భంగమొనర్పఁగలాఁడె? యెవ్వఁడున్
దైవము దోసకారులకుఁ దద్దయుఁ దోడయి రాకయుండినన్॥

ఆహా! రేయి యనక పగలనక చిత్తూరుగఢనాథ మీ రస పుత్రులరి వీరులతో నత్యంతఘోరంబుగాఁ బోరుచుండిరట. ఔరా! నేనెంత పాపిష్ఠురాల నైతిని!

క॥ రణనిహతులైన భర్తల
మనములఁ దలపెట్టి తోడిమానవతుల్ దా
మనిశముఁ జింతాసాగర
మున మున్గుటఁ జూడనేనె మూలంబుగదా!

ఇందఱు సోదరకామినుల దుఃఖంబునకు హేతుభూతంబగు నాపై నామృత్యుదేవతకైన దయరాదుగదా! అక్కటా! దురంతచింతాక్రాంతస్వాంతు లగు నా కాంతామణులు నన్నెంతగాఁ దూరుచుండిరో! ఇట్లనిశ మనాథయువతీజన ప్రదూషితంబైన నా సముజ్జ్వలాంగంబు నగ్నియందుఁ బ్రవేశపెట్టుట యుచితంబని తోఁచుచున్నయది. అదియునుఁ గాక సత్యాసత్యము లరయని కుచ్ఛితాత్ములగు ప్రజలచే వ్యాపింపఁబడిన దుర్వాదంబును నాకర్ణించుచుండి మొండినై జీవించుటకన్న మండుచున్న యగ్నికుండంబులోఁ బడి ప్రాణంబులఁ గోల్పోయి మత్పాతివ్రత్యంబును వెల్లడింపఁజేయుట తప్ప నాకు వేరొండుసాధనంబు తెలియకున్నది. (ఆలోచించి) నేను కృత

నిశ్చయురాలనైన నేమి ప్రయోజనము? ఈ ఘోరకృత్యం బొనరించుకొనుటకు మన్నాథుండు నాకనుజ్ఞ నొసంగవలయును గదా! (హృదయమున జేయిడి) చిత్తమా! ఏల నిష్ప్రయోజనంబుగ నాలోచించెదవు.

తే॥ గీ॥ అగ్నిసాక్షిగఁ బెండ్లాడి యనవరతము
వారిచే సర్వసౌఖ్యముల్ వడయుచుండి
ప్రాణములకంటె ప్రేమానురాగమునను
జూచుకొను భార్యలకు నగ్నిఁ జొరఁగ నాజ్ఞ
నిచ్చువాఁ డెట్టి ప్రియభర్త యెచ్చటైన?

(తల పంకించి) అయినను మన్నాథునకు నాకోరిక నెఱింగించెదను. నేఁ డేలొకో యర్ధరాత్రంబు గడచినను నాథుండు రాకుండెను? ఆహా!

ఉ॥ సుప్తి నెఱుంగ కుంచుకయు సొంపెసలారఁగఁ బల్కుడింక సం
తృప్తిగఁ దా భుజింపఁడు తదేక విచారమనస్కుఁడౌచు ప
ద్మాక్షకులోద్భవాధిపుఁ డహర్నిశముల్ రణరంగమందునన్
దీప్తివహించి శాత్రవులఁ ద్రెళ్ళఁగ నేయఁ గడంగు టాదిగా॥

శస్త్రాస్త్రవిద్యాపారంగతురాలనైన సంయుక్తవలె నాథునకు సహాయభూతురాలనై రణముఖంబున శాత్రవుల నుక్కడంచు భాగ్యంబు నోచుకొనలేదు. ఆహా! నిద్ర యంతకంత కధిక మగుచున్నది. (పరుండును)

ప్రవేశము-భీమసింగు.

భీమ — (విచారముతో)

ఉ॥ ఎంతటిఘోరవార్త వచియింపఁగ నే నిటవచ్చితిన్; గటా
సుంతయు వెన్కదీయుక ప్రసూనశరీరని నాదుభార్య న

త్యంతశుభోజ్జ్వలాంగిని "రయంబున మండెడు కుండమందు ని
శ్చింతమనస్కురాల వయి చేరు" మటంచు శిలాత్మధారివై!

ఔరా! భీమసింగ్జీ! నీవు పుట్టుకయందే గిట్టిన నిట్టి కష్టములఁ బట్టువడకుందువుగదా! జన్మించినను యే గర్భదరిద్రునియింట జనించిన నిట్టి నితాంతచింతల నొందకుందువుగదా! సురనుతంబైన రాజకులంబున నుద్భవించి యష్టైశ్వర్యాఢ్యుండవైతివి. అంతేగాని కడుపునిండ కూడును, కంటినిండ నిద్దురయుఁ గల్గియుండు సమయముఁ గాంచవైతివి. విజయలక్ష్మినిఁ బొందుట దుస్తరంబనియు. రాజ్యలక్ష్మి మ్లేచ్ఛులచే బడుట సత్యంబనియు నిరాశాపూరితహృదయుండవై యర్ధాంగలక్ష్మి సకలస్త్రీసమేతంబుగా నగ్నిలోఁ బడి యాత్మహత్య నొనరించుకొనుచుండ జూచుటకా యింకను జీవించియుంటివి? దైవమా! యింకనైన నీదురదృష్టవంతుండైన భీమసింగున కనుకూలుండ వగుట భరమా? రిక్తచిత్తమా! ఇంకను దైవము నీయెడల ననుకూలుండగుననియా తలంచుచుంటివి? ఛీ! ఇంక నాకీ మొండిబ్రదుకేల? (కత్తిఁ బెఱికించి)

చ॥ నిరుపమశస్త్రవిద్యలను నేర్చినదాదిగ శత్రుసేనలన్
దురమునఁ దున్మచున్ జయముఁదోడనెగాంచి భవన్మనంబు సం
బరపడఁ దృప్తిఁ గూర్చితిని యిల్మరు; నట్టుల నిప్డు లేదు నా
శిరమును మన్ని తృప్తి నిఁకఁ జెందుము వేగఁ గృపాణరత్నమా!

ఛీ! యేమియిది! తుదకు స్త్రీకృత్యంబునకుఁ దొడగితి! నేనిట్లాత్మహత్య నొనరించుకొనిన రాజపుత్రస్త్రీలకు తానున్న దుర్దశ రాకుండునా? వైరులు చిత్తూరుదుర్గంబును వశపఱచుకొనకుందురా? రసపుత్రశూరులెల్లరును తమతమభార్యలను "జోహా"రొనరించుట కొడంబడునట్లు బుద్ధులు గఱపుచుండిరి. నేనును మత్ప్రియభార్య నందుల కొడంబరచెదను.

(పద్మినిశయ్యకడ కరిగి బాగుగఁజూచి)

సీ॥ అవరోధపద్మాకరాంతరంబున ముకు
ళితపద్మవదనయై సతి పరుండె
దరిగనరాని చింతావార్ధి మున్గిన
హృదయప్లవంబుతో ముదిత యుండె,
భూరివిపజ్జలముత్పాదితం బగు
చంద్రాస్యమూమది సతి పరుండె,
ఘననిరాశాభయంకర మారుతమున వ్రా
లిన లతాంగియయి మానిని పరుండె.

తే॥ గీ॥ గాని యెల్లి సూర్యోదయ కాలమందు
నగ్నికుండమునందు దేహమును జేర్చు
సంగతి నొకింతయును దెలియంగ లేకు
సదయనవసితహృదయ లసచ్ఛత్రి!

(అని దగ్గర కేగిన పద్మిని లేచి వందనంబు లొనరించి)

పద్మి— నాథా! నేఁడింత యాలస్యముగా వచ్చితిరి. గతంబేమి? ముఖలక్షణములఁ బట్టి చూడ నేదియో దీర్ఘాలోచనపరులై వచ్చినట్లుదోఁచెడిని.

భీమ— కాంతామణీ! ఈ ఘోరసంగ్రామ ఫలం బాపదించెనో గాని (అని విసుకుకొనును!)

పద్మి—నాథా! నాదెంత పాపిష్టిజన్మంబైనది.

సీ॥ నామూలమునఁగదా భూమీధవులుమీరు
కారాగృహంబునఁ గష్టపడిరి,
నామూలమునఁగదా నేమారు చిత్తూరు
పురలక్ష్మి వెతలను బొందవలసె

నామూలమునఁగదా నళినమిత్రకులోద్భ
వులు పెక్కుమంది యాకలనబడిరి
నామూలమునఁగదా నాథులఁ గోల్పోయి
యెందఱో సతుల్ గుందుచుండిరి

తే॥ గీ॥ తాత ముత్తాతలాదిగాఁ దనరుచున్న
రాజపుత్రుల స్వాతంత్ర్యరాజ్యమిప్డు
తురకల వశమునను బడ నరుగుచుంట
కూడ నామూలముననగాదె చూడఁజూడ.

కావున నీ దురదృష్టురాలిని బాణిగ్రహణమొనరించుకొన కున్న యిన్నిసిలుగులు సంభవించుండునుగదా!

భీమ.— ప్రేయసీ! అట్లనెద వేల? ఇంచుక యోచింపుము.

తే॥ గీ॥ జన్మమొందక మున్నె కంజజుఁడు నుదుట
మూఁడు పంక్తుల లిఖియించు పూర్వజన్మ
కర్మ ఫలమును గుర్తించి కమలనేత్రి!
దాని దప్పించుకొన నేరితరము చెపుమ?

కావున నీసంకటంబు లన్నియు నా పూర్వజన్మకృతదోష విశేషంబులు గాని నిన్ను నుద్వాహంబొనరించుకొన్నందు వలన దారించ లేదు.

పద్మి.—నాథా! మీరుమన్మానసోపశాంతి కిట్లనుచుండిరి గానినామనో వ్యథను బోగొట్టికొనుట కెందు సాధనంబు లేకున్న యది.

భీమ.— ప్రాణేశ్వరీ! అంతమనోవ్యథ నొందుటకు గారణమేమి?

పద్మి.—నాథా! కారణం బిద్దియని వేరె చెప్పవలయునా? నేనీసుంద రాకారంబున జన్మించుటయే యిందులకు ముఖ్యకారణము! అదికాక ప్రజ లేమనుకొనుచుండిరో తెలియదా?

భీమ— ఎవరివిషయమై?

పద్మి— ఈపాపిష్ఠురాలిని గుంఱించియే!

భీమ— ఏమీ! ప్రజలు నీవిషయమై యేమనుకొనుచుండిరి? త్రిలోక సుందరివనియు, పరమపతివ్రతామణి వనియు,

పద్మి— అట్లనుకొను దినంబులు గడచినవి.

భీమ— ఏమను కొనుచుండిరి?

పద్మి— చెప్పుటకుఁ గూడ దుఃఖమగు చున్నది. ఇంతకు నాపూర్వ ఫల కర్మమిట్లుండ నే జేయునదేమి?

భీమ— ప్రేయసీ! ఏల యీవెడగు మాటలు? ఏ మనుకొనుచుండిరో చెప్పుము.

పద్మి— నేను తురుష్కనాయకుని యధీనంబైతిననియు నంతట మీరా క్షత్రియకుమారుని జయించి నన్నుఁ దీసికొని వచ్చితిరనియు.

భీమ— ప్రేయసీ! దీని కింతగా జింతింప నేల? పలుమాసంబులు నిజ నాథుని నామ స్మరణంబే యన్నపానంబులుగా గడపినట్టి మహాపతివ్రతయగు సీతామహాదేవి విషయమై జను లింతకంటె నెక్కుడు వదంతిని వ్యాపింపఁజేయలేదా?

పద్మి— నాథా! అందులకు శ్రీరాములవారేమి ప్రతిక్రియ నొన రించిరో యెఱుంగరా? భార్యనుఁ బరిత్యజించెను. నాకనుజ్ఞ నిచ్చినచో నే నీ పాపిష్ఠిజన్మంబును ద్యజించెదను.

భీమ— (తనలో) నే వచ్చినపనియు నీపె కోరికయు నొకటియే యయి నది. (ప్రకాశము) ప్రేయసీ!

మ॥ పరిహాసంబున కైన నిట్టి పలుకుల్ పల్కంగ నుంకించ నీ
తలఁచి నాయమాధుల దుర్వదంతిని తనూత్యాగంబు పోగొట్టునే?

సరిలే; నిన్నుఁ బరిత్యజించిన భువిన్ సౌఖ్యంబు వే రెద్ది; హా!
సరసీజాక్షిరో! యిట్టియుద్యమ మికన్ జాలింపుమా యింతటన్.

మఱియు.

సీ॥ చాల నాసంసారాబ్ధి నోలలాడఁగఁ దన
యర్ధాంగియే తెప్పయగును సతిరో!
వాసిమహిమలచే వర్ధిల్లుటకుఁ దన
యర్ధాంగి పట్టుకొమ్మౌను సతిరో!
భువిని మోహామదేభమును మరల్పఁగ దన
యర్ధాంగి యంకుశంబౌను సతిరో!
సకలార్థ కామమోక్షముల నొందఁగఁ దన
యర్ధాంగి సాధనంబౌను సతిరో!
తే॥ గీ॥ కాన నర్ధాంగివిడనాడి మానవుండు
జగతి నే సౌఖ్యమందఁగఁ జాలు నతివ!
భార్య లేనట్టిమగవాని బ్రతుకుకంటెఁ
గష్టజీవన మిక వేరు కలదె చెపుము?

కావున నేల నీవు కాయంబును బాసి నన్నుఁ గష్టములఁ బాల్పడఁ జేసెదవు?

పద్మి—అయిన నో ప్రాణకాంతా! పురుషునకెట్టి సంకటములు గలిగినను నవి భార్యవలననేకదా కలుగుచున్నవి.

భీమ—తరుణీ! అట్లనెద వేల! సుఖదుఃఖంబుల నందునపుడు సతీపతులిరువురును సమానులే గాని యందునొకరివలన నొకరికిఁగలుగునను మాట కల్ల.

పద్మి—ఇదంతయు నేల? నే నీదుర్వాదంతిని వినుచు మనజాలను. అగ్నిప్రవేశంబొనరించి యీదుర్వాదంతిని నిర్మూలించెదను. నా కాజ్ఞ

నొసంగుము. హా! రాజపుత్రస్త్రీలారా! మిమ్మెల్లర విడనాడు కాలము నాకాసన్నంబయినది.

భీమ—(తనలో) నేవచ్చిన కార్యము నెఱవేర్చుటకిదే సమయము. (ప్రకాశము) కాంతామణీ! రాజపుత్రస్త్రీల విశేషవిశిష్టపు స్వభావము చెప్పవలెను. వారెల్లరు శీఘ్రముగ "జోహార్" నొనరింతురు.

పద్మి—(భయాశ్చర్యములతో) నాథా! నాకితంబున వారెల్లరు "జోహార్" నొనరింతురా?

భీమ—సతీమణీ! సకతంబున నెట్లగును? పరాధపీరుల మని పేరు నొందిన వారిజాక్షులు ధర్మపురి యందుకుఁ గారణభూతులు.

ఉ॥ వైరులు కోటఁబట్టుకొనువారని నిశ్చయమంది వారలన్
బాఱఁగఁ దోలలేక తమ భార్యలు మ్లేచ్ఛుల చేతఁజిక్క తా
మిటఁ దొడఁడొంటి దినులను చందఁగలారవమానమంచు "జో
హా" రొనరింపఁగా సతుల కాజ్ఞనొసంగిరి రాజపుత్రికుల్॥

పద్మి—నాథా! తుదకీ రాజపుత్రస్త్రీల కెట్టిదుస్థితి చేకూర్చితిరి!

భీమ—తరుణీ! నీవిట్లు మనయెడలఁ బ్రతికూలుఁడైన నిట్టి దురవస్థ రాకుండు టెట్లు?

పద్మి—నాథా! యిట్లు స్త్రీలనందఱిని నశింపఁజేయ గడంగితిరిగదా. ఒకవేళ దైవ మనుకూలుండై మిమ్ము విజయోన్ముఖులఁ జేసిన నేమిచేసెదరు?

భీమ—యువతీమణీ! యింకను మనకు విజయము చేకూరునని యూ తలంచుచుంటివి. చేకూఱిన నేమి?

తే గీ॥ భార్యలు గతించినను వేఱుపడతులను వి
వాహమాడఁగవచ్చును వారిజాక్షు

లకవమానంబు సంఘటిల్లఁగలదేని
మరల మానంబుఁ గొనుట దుస్తరముగాదె॥

(తెరలో ఘంటా మోగింపఁబడును.)

భీమ—ప్రేయసీ! మూడవ యామము గడచి నాలుగవ యామమారం భించినదని తెలియఁజేయు ఘంటా మ్రోగింపఁబడుచున్నది. ఇఁక గొన్నిగడియలకు మనకు వియోగకాలం బాసన్నంబగును. భవదీప్సితం బొసంగితిని.

పద్మ—తే॥ గీ॥ ఏఁ గృతార్థురాల నయితి నింక మీకు
ముదముతో నే గృతజ్ఞతాపూర్వకముగఁ
జేయుచుంటి నమస్కృతుల్ స్వీకరించి
నన్ను నాశీర్వదింపుడీ సన్నుతాంగ॥

భీమ—ప్రేయసీ! రాజపుత్రస్త్రీలు జోహారొనర్చుటకు సిద్ధముగ నుందురు. నీవును సిద్ధముగ నుండుము. ఇఁక నేను నిష్క్రమించెదను. (భీమసింగు నిష్క్రమించును.) (యవనిక వ్రాలును.)

---

## ద్వితీయ రంగము. 'జోహారు'

(ప్రవేశము) భీమసింగు, లక్ష్మణసింగు, బాదూల్ సింగు, విక్రమసింహుఁడు, మఱికొందఱు రసపుత్రయోధులు.

భీమ—రాజపుత్రయోధులారా! రాణా! లక్ష్మణసింగ్జీ!

చ॥ అలరఁ బతివ్రతామణు లటంచు ద్రిలోకములందు సంస్తుతిం
బొలుపుగఁ గాంచి మించు రసపుత్రకులాంగన లెల్ల దుర్దశా

కలితహృదంబుజాత లయి క్రన్నన మన్ననతోఁ గృశానుకీ
లల బడనుండి రిష్టని కలంగకుఁడీ విధివ్రాత దప్పునే ?

లక్ష్మ—భీమసింగు మహారాజా! తదితరస్త్రీజనవిషయమై కలుగు
దుఃఖంబున కేమిగాని,

సీ॥ చంద్రబింబంబు నిస్తంద్రప్రభాసాంద్ర
మందె నే యువతిముఖాంబుజమున
నిరతపాతివ్రత్య మురుధనంబై స్థిరం
బయ్యె నే తరుణీహృదంబుజమున
రచుణించు దానధర్మమ్ములు నిలిచె నే
లలితాంగి హస్తపల్లవములందు
సతిసాధుశీలంబు నుతికెక్కె యమరె నే
నలినాక్షి మందయానంబునందు

తే॥ గీ॥ ధరణిఁ గమలాలయోపమ గరిమఁ గాంచె
నేసతీమణి ప్రియవచ శ్రీసమితిని
నట్టి మామాత పద్మినీ పట్టమహిషి
కాలుచిచ్చున బడ నోర్వఁగలమె చెపుడీ॥

(తెఱలో)

తే॥ గీ॥ మంగళస్నాతలై శుభమంగళంబు
లెలుపు వాద్యసమేతలై స్త్రీసమూహ
మతిముదంబును జెంది జోహా రొనర్ప
వచ్చుచుండిరి నిర్జరుల్ మెచ్చుచుండ॥

భీమ—(విచారముతో) హా! స్త్రీజనంబులారా! మి మ్మెల్లర నింతదుర
వస్థపాంతఃజేర్చిన యీ భూకాంతునకు సుగతిగలదా? (దూర

ముపరికించి) రాజపుత్రశేఖరులారా! ఏమీ చిత్రము? ఇక్కడివల యుపటి తురుష్కుల నుక్కడింపలేక రాజపుత్రకులాంబురుహా స్యులనెల్ల సంతాప బెట్టి దుర్మరణముపాలొనర్ప సిద్ధంబయ్యె నని యాదిత్యుండు సముగ్ర క్రోధాగ్ని సహస్ర ధాముండై యేలకో నాపయి దండెత్తి వచ్చుచున్నట్లు దోచెడి.

బాదూల్—రాజేంద్రా! ఏల భ్రమపడెదరు? ఆ వచ్చువారు రాజ పుత్రాంబురుహాననలు గారా?

భీమ—ఏమీ చోద్యము! ఈతండు సదాగతుండయ్యెం దట్లెల్ల తాం గులనెల్ల వాయుసఖుని కాహారంబొనంగుటకు నిశ్చితుండయ్యె నని మీనునాథుండు పాపఁగా సహస్రసమూహంబు దాల్చిన క్రో ధాగ్ని జేవతాహస్తంబులయుండు ప్రకాశించు ఖడ్గసహస్రంబు నాపయిఁ బడవచ్చుచున్నట్లున్నది.

సిక్రి—రాజా! యిది మీ మఱచ్చుపాటు. ఆ వచ్చునది రసపుత్రాంగీ శ్రేణిగదా.

భీమ—ఆహా! ఈ యుద్ధాంగలక్ష్ముల కెల్లరకు దుర్మరణంబు జేకూర్ప నున్న రాజపుత్రుల నెల్ల శిక్షించుటకు యుద్ధనాయకగిరుండైన శితికం ఠుండు పంపిన నిటలనేత్రాగ్నిజ్వాలలు మనపై వచ్చుచున్నవి.

లక్ష్మ—రాజా! ఆ వచ్చువారు సకలసువర్ణభూషణభూషితాంగులగు రాజపుత్రాంగనామణులు గదా.

(ప్రవేశము) పద్మిని, మఱికొందఱు రాజపుత్రస్త్రీలు.

భీమ—హా! యువతీమణులారా! మీ రందరు జోహారొనర్చుచుండ జూచి మేమెట్లు సహించగలము? (పద్మినీదేవిని సమీపించి హా! పద్మినీ!

సీ॥ దేదీప్యమానమందిరవాసినీ! నీవు
ఏకాకి గిరులలోఁ జేరుటెట్లో ?
మృదులశయ్యలపైన నిదుర జెందెడు నీవు
ఱాళ్ళ చిలిపైని నిలయుటెట్లో ?
హిమకరకిరణజాలముల నిత్యము నీవు
ఘోరదావానలంబున గ్రుంగుటెట్లో ?
యనిశంబు నాకు నర్ధాంగివౌ నీవు నన్
విడనాడి కడువడి వెడలుటెట్లో

తే॥ గీ॥ సమదకుటిలకఠిన సంకటముల మున్గి
పుడమి నే నిడుముల నొంది యడలుచుండ
ముందుగా నీవు పోయి యాముష్మికంబు
నొంది సౌఖ్యంబు లందుచు నుండు టెట్లో?॥

పద్మి— నాథా! సకల మెఱింగిన మీరలే యిట్లు వికటప్రాజ్ఞులవలెఁ బల్కుచుండ నే నేమి చెప్పఁగలను? నిశ్చలత్వం బొందిన నా మానసంబును గ్రమ్మఱఁ జలింపఁ జేయకుండునట్లు ప్రార్థింపుచున్న దాన. ఇఁక మాకీభూమ్యంతరనిర్మితంబులగు గుహలలోఁ జేర ననుజ్ఞనిండు. కాలంబతిక్రమించుచున్నది. వైరులు దుర్గంబునఁ బ్రవేశించిరేని మాకు బ్రమాదము సంభవించును.

భీమ— ప్రేయసీ! ఈ ఖలుం డిందులకు మాత్రము సిద్ధుండై యున్నాఁడు.

పద్మి— మనోహరా! నమస్కారములు (పాదములపైఁబడి లేచును)

(పద్మినిమొదలగు స్త్రీలెల్లఱు నిబద్ధాంజలులై)

పద్య—

* దండకము *

శ్రీమజ్జగన్మిత్రవంశాబ్ధి సంభూతురాం డ్రేందిరాసుందరీరత్న
పాదాంబుజధ్యాన పీయూషపాన ప్రమత్త ప్రచిత్తల్సదా
దివ్యచారిత్ర లత్యంత మానాభిమానాంబై నిత్యవ్రతస్ఫూర్తి
వర్తించువారల్ జగన్మోహనాకారిణుల్ పెక్కు వర్షంబులం
దొట్టి యీరోజుదాఁకన్ విదేశీయులై ముష్కరాధ్యక్షులౌ
మ్లేచ్ఛసైన్యాళిచే మానభంగార్తి నెక్కింతయుం జెందకున్నార
లిస్లాతురుష్కాధి నాథుండు దుర్గంబు భగ్నంబు గావింప
యత్నించి, యం దగ్ధభాగంబు నాశంబుగావింపనావోప్పవీక్షించి
యాదిత్యతుల్యప్రదీప్త ప్రదుల్ రాజపుత్రాఖ్యు లింకెట్టులైనం
బరాభూతులై కోట మ్లేచ్ఛాళికిం జిక్కఁగాఁబట్టి కాంతా
మణుల్ మానభంగంబు నొందంగలారంచు మమ్మెల్ల జోహా
రొనర్పంగ నాజ్ఞాపనం బీయ మేమెల్ల నిప్పట్టునం దీమహా
కీలలంజొచ్చి యచ్ఛ్రాంతవిశ్రాంతకీర్తిం వహింపంగ నేతెంచి
నామిప్పుడీ వెంతయుం వీరలాదిత్యవంశంబునం బుట్టిరే యంచు
విస్తారవహ్నాజాలిమై శీతలంబాదఁ బోకింకనిన్నెక్కుడౌ భక్తిమై
ప్రార్థనల్ చేతు మోపావకా! వీతిహోత్రా! నమస్తే నమస్తే
నమస్తే నమః (అందఱు గుహలోఁ బ్రవేశింతురు).

విక్ర—(మండుచున్న కొఱవులుఁ బుచ్చుకొని) రాజా! ఇంక మీరీ
చితుల కగ్ని నంటింపుఁడు (భీమసింగునకు కొఱవుల నిచ్చును.)

భీమ—(కొఱవులఁ బుచ్చుకొని) ఔరా! ఏమీ కాలమాహాత్మ్యము.
స్వపరిపాలనస్థితానేక దాసదాసీజనయాచక మంత్రి చమూ

పురోహితబాంధవాదరణస్ఫూర్తివెలయునీదక్షిణహస్తంబుతుద కునకలరాజపుత్ర సమేతంబులయిన చితులకు నగ్ని నంటించుట కుపయోగింపఁబడ వలసివచ్చినది. హా! వివిధశస్త్రాస్త్రవిద్యా భూషితంబై దుర్మదరిపు కుంభికుంభచ్ఛేదన సాధనంబగు కర వాలంబుధరియించు నీదక్షిణహస్తంబు చివర కబలలచే నిండి యుండిన చితుల వెలిగించుటకునియోగింపఁ బడవలసి వచ్చెను. హా! విధీ! ఎంత రెమొనర్చితివి! (చితుల నంటించును. రాజ పుత్రు లొక పెద్ద బండ నాగుహాద్వారంబున కడ్డము వేతురు.)

భీమ—

* దండకము *

శ్రీ సజ్జగన్మిత్రవంశాబ్ధిరాకాసుధాధాము లౌ పూర్వరాజాత్మ జుల్ నిన్ను నభ్రంకషోత్తుంగ ధాత్రీధరవ్రాతముల్ జుట్టునుం గల్గియున్నట్టి పీఠస్థలంబందు నిర్మించి ఘోరారిహృద్భీకరంబా యఖాతంబు త్రవ్వించి తత్ప్రాంతమందుఁ విశాలోన్నతప్రాభి వర్తించు ప్రాకారముల్ గట్టి యట్టాలకంబుల్ బలిష్ఠంబుగాఁ గట్టి చోద్యంబుతో గొప్ప ప్రాసాదముల్ దివ్యదేవాలయంబుల్ ధనాగారముల్ శస్త్రవిద్యా గృహంబుల్ మహాలీల నిర్మించి నానారిపుక్ష్మాతలాధీశులన్ సంగరక్ష్మాతలిన్ వే బరాభూతు లం జేసి యాశాంతవిశ్రాంతకీర్తి ప్రపూర్ణాత్ములై నిన్నుఁ బాలించి నారిప్పుడీ భూతలాధీశుడుత్తుంగ శౌర్యంబు వర్ణించి శత్రుక్షమానాథు సైన్యాళిఁ దున్మాడగాఁ జాల కిట్లంగనారత్న సంఘంబు నెక్కుమ్మడిన్ ఘోరదావానలంబందు దేహంబులర్పిం పగాఁజేసి నీ రక్షణార్థంబు హస్తంబులందున్ వెసన్ ఖడ్గముల్

చూసి మేమెల్ల సంగ్రామరంగస్థలిఁ శత్రులఁ గూల్చుటయో లేక యువ్వారిచేఁ జచ్చుటయో రెంటిలో నేదియో నిశ్చయంబంచు యోజించి యొక్కుమ్మడిఁ శత్రులఁ మార్కొనఁ బోవఁగా నుండుట నింకఁ మముస్సుకృపాదృష్టులంజూచియుఁ గ్రమ్మఱఁ మేము నిప్రాపునందుండి సంతోషముండెంది నిందృప్తురాలిఁ దగంజేయ మమ్మెల్ల దీవింపుమా! కాచి రక్షించుమా! దుర్గ లక్ష్మి చిత్రాంగ్ దుర్గలక్ష్మి నమస్తే నమస్తే నమస్తే నమః

(ప్రవేశము) తురుష్క సైనికులు.

(రసపుత్రులకుఁ దురుష్కులకు ఘోరయుద్ధంబు జరుగును. రసపుత్రు లెల్లను నశింతురు. తురుష్కులు కోట నాక్రమించుకొనెదరు.)

(తెర పడును.)




చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

# శ్రీ వెంకటేశ్వర కంపెని, గుంటూరు.

## ఇచ్చట దొరుకు గ్రంథములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | హరిశ్చంద్ర | ... | ... | 1— 4—0 |
| 2 | సత్రాజితీయం | ... | ... | 1— 0—0 |
| 3 | చిత్రమాధకం | ... | ... | 0—12—0 |
| 4 | భజగోవిందం [ శ్లోకములమాదిరి పద్యములు ] | | | 0— 1—0 |
| 5 | భరతమాతదండకం | ... | ... | 0— 1—0 |
| 6 | గాంధీమహాత్ముని జీవితచరిత్ర | | ... | 1— 8—0 |
| 7 | గాంధివిజయం | ... | ... | 0—12—0 |
| 8 | గాంధిమహోదయం | ... | ... | 0— 8—0 |
| 9 | కలియుగప్రహ్లాద | ... | ... | 0—10—0 |
| 10 | సంస్కారిణి | ... | ... | 1— 0—0 |
| 11 | అహమ్మదాబాదు కాంగ్రెసుసభ | | ... | 0— 4—0 |
| 12 | ఆలీ ప్రభృతుల నిర్బంధము | | ... | 0—10—0 |
| 13 | స్వరాజ్యసమస్య | ... | ... | 0— 4—0 |
| 14 | తిలక్ హరికథ | ... | ... | 0— 8—0 |
| 15 | రామదండుపాట | ... | ... | 0— 8—0 |
| 16 | దేశీయ కీర్తనలు | ... | ... | 0— 8—0 |
| 17 | స్వరాజ్యసాధన | ... | ... | 0— 8—0 |
| 18 | డిటో భజనకీర్తనలు | ... | ... | 0— 4—0 |
| 19 | స్వరాజ్యలక్ష్మీవ్రతం | ... | ... | 0—10—0 |
| 20 | మహాత్మ గాంధి ఆరోగ్యసాధన [ హిందీకి తెనుగు ] | | | 0—10—0 |
| 21 | నా చెరసాల అనుభవం [ గాంధి ]. | | ... | 0—12—0 |
| 22 | స్వరాజ్యమోతుము | ... | ... | 0— 1—6 |
| 23 | చిత్తరంజనదాసుగారిజీవితము | | ... | 0— 8—0 |
| 24 | రసపుత్రికదనము | ... | ... | 1— 0—0 |
| 25 | సంపూర్ణ ఉత్తరరామాయణం | | ... | 1— 0—0 |
| 26 | బుద్ధిమతీవిలాసము | ... | .. | 1— 0—0 |
| 27 | సంపూర్ణరామాయణం | ... | ... | 1— 0—0 |

వర్తకులకు కమీషన్ సరసముగా యివ్వబడును.

 శ్రీ వెంకటేశ్వర కంపెని,

గుంటూరు.

# తారీఖుల జంత్రి వడ్డి జంత్రి.



1 ఇందు గతసంవత్సర 1867 సరియైన ప్రభవ సంవత్సరం మొదలు రాబోవు 1939 సంవత్సర ప్రమాదిసంవత్సరమువరకు తెలుగుసంవత్సర మాసతిథులకు సరియైన ఇంగ్లీషుసంవత్సరముల నెల తేది వారములను తెల్పునదియై యున్నది.

2 ఇందు రు 1—0—0 మొదలు 5 వందలరూపాయలవరకు నెల 1 కి రు 0—4—0 లు మొదలు రు 2—0—0 లు వరకు రోజుకు నెలకు సంవత్సరముకు అయ్యేవడ్డి జంత్రియున్నది,

3 నెల 1 కి 4 అణాలు మొదలు 250 రూపాయలువరకు ఇంటి అద్దెలు కూలీల మస్తర్లు జీతములు వగైరాలు 28, 30, 31 రోజులుగల నెలలలో రోజుకు ఎంతఅయ్యేదిన్ని మొదలగు సంగతులు తెలుపు జంత్రియున్నది,

4 కరణములకు పనికివచ్చునట్లుగున యకరా 1 కి 0—1—0 మొదలు 20 రూపాయలవరకు 100 యకరములపర్యంతము అయ్యే శిస్తుయొక్క రేట్లు అదేప్రకారముగా 100 సెంట్లువరకు అయ్యేమొత్తమున్ను, రోడ్డు విలేజి లోకల్ ఫండ్లు జంత్రి తెల్పును. అదిచూచు విధము వాటియందే వ్రాయబడియున్నది.

5 వస్తువు 1 కి పైసా మొదలు 1 రూపాయివరకు 100 వస్తువులవరకు అయ్యేమొత్తమును, క్రొత్తగా అమలులోకివచ్చిన, పోస్టేజీ వగైరాలును రిజస్ట్రేషను ఫీజులు, కోర్టు స్టాంపుడ్యూటీ, మొదలగు హాంశములు తెలుపును.

యిప్పటికి 4000 పుస్తకములు ఖర్చుఅయినవి.

వెల పోష్టు ఖర్చులు సహా రు 1—10—0 లు మాత్రం

వలయువారు :—

జి. సేతుమాధవరావు బ్రదర్సు,
గుంటూరు
(అని వ్రాయవలెను.)

# کتب خانہ

جامعہ عثمانیہ

۱۔ اراکین مجلس اعلیٰ، مجلس بقا، مجلس انتظامی، مجالس شعبہ جات و نصاب پانچ کتابیں ایک وقت میں اپنے پاس رکھ سکیں گے۔

۲۔ اساتذہ جامعہ عثمانیہ و کلیات ملحقہ، گریجویٹ عہدہ داران جامعہ اور اراکین دار الترجمہ دس کتابیں ایک وقت تک اپنے پاس رکھ سکیں گے۔

۳۔ طلباء میں رجسٹر شدہ دو کتابیں بی اے اور انٹرمیڈیٹ کے طلبہ تین کتابیں، ایم اے، ایل ایل بی و تحقیقاتی جماعتوں کے طلبہ پانچ کتابیں دو ہفتہ کے لیے اپنے پاس رکھ سکیں گے۔

۴۔ مدت مقررہ پر کتابیں واپس نہ ہوں تو تاخیر کے حساب ایک آنہ یومیہ فی کتاب وصول کیا جائے گا۔

۵۔ بشرط موقع کتابیں گھر پر دی جا سکیں گی مگر حوالہ کی غرض کے لیے کتب خانہ میں کتاب کا لانا لازم ہے۔

۶۔ کتابیں گم یا خراب ہو جائیں تو مستعیر پر ذمہ داری عائد ہوگی۔

۷۔ کتابوں پر کسی قسم کا نشان سیاہی یا پنسل سے نہ لگایا جائے۔

۸۔ قلمی نسخے اور حوالے کی کتابیں جاری نہ کی جائیں گی۔